# MINNANTI EGARATAANIKI

*An Anthology of  Poems*
*by*
***Dasoju Gnaneshwar***

First Edition : February 2017



Rs. 100/-

Copies : 1000

Cover Design : **Kurella Sreenivas**

For Copies : Smt.**D.Padma (Veena)**
99121 38152
plot no. 141
Sri Shivasai Township
opp: 12th Police Battalian
G.P. Yellareddy gudem
mndal : Narketpally
Dist : Nalgonda
TELANGANA - 508254

Printed at :

## సమక్షంలో సాధ్యం కానందుకు

అమ్మా!
నీవు ఉన్నంతకాలం నేను వసంతాన్ని
అంతర్ధానమయ్యాక శిశిరాన్ని
నీవిక నా దగ్గరలేవని
కన్నీళ్ళను భరించలేనని
భగవంతుడు
కవిత్వాన్ని వరంగా ఇచ్చాడు
ఇప్పుడిక ఈ కమ్మని కవిత్వమే
ఉ(అ)మ్మనీరై నన్ను కాపాడుతుంది
అమ్మా !
అందుకే నీకు **"అంకితం"** ఈ
**"మిన్నంటి ఎగరటానికి..."**

కవి తల్లిదండ్రులు



శ్రీ దాసోజు అంజయ్య, కీ॥శే॥ శ్రీమతి లక్ష్మమ్మ గారలు

# సూచిక


| | | |
|---|---|---|
| విత్తన కోశం | ఆచార్య ఎన్. గోపి | |
| పరకాయ ప్రవేశం | డా॥అమ్మంగి వేణుగోపాల్ | |
| ఊపిరి పోసుకున్న అక్షరాలు | డా॥కూరెళ్ళ విఠలాచార్య | |
| సూటిగా సారించిన అక్షరాంబువు | వేణు సంకోజు | |
| కృతజ్ఞతలు | | |
| 1. వెలలేని పూలు | | 1 |
| 2. జ్ఞాపకాల లాకర్ | | 4 |
| 3. మైనస్‌నా!? | | 7 |
| 4. చిగురు | | 9 |
| 5. మైనపు శిల | | 10 |
| 6. వెలుతురు ముద్ద మా అమ్మ | | 12 |
| 7. వృక్షోహం | | 15 |
| 8. రైతుదే తెలంగాణం | | 18 |
| 9. కవిత్వమంటే | | 21 |
| 10. భయవిహ్వల | | 22 |
| 11. నేను దు:ఖాన్ని | | 23 |
| 12. మిన్నంటి ఎగరటానికి | | 25 |
| 13. బాలకార్మికులు | | 27 |
| 14. ఓటు | | 28 |

| | | |
|---|---|---|
| 15. | అభిశంసన | 29 |
| 16. | ఏం మనుషులో | 32 |
| 17. | నిక్కాక | 33 |
| 18. | చిదంబరుడు | 36 |
| 19. | ఇలాంటి వాడొకడుంటాడు | 39 |
| 20. | ష్ ష్ ష్... | 41 |
| 21. | సీ గుడ్డు | 42 |
| 22. | అంటుకడుపు | 43 |
| 23. | యయాయా! | 46 |
| 24. | ధర్మోరక్షతి రక్షిత: | 47 |
| 25. | లువధవె | 50 |
| 26. | అర్థమపార్థం | 52 |
| 27. | కార్గిల్ | 55 |
| 28. | మెతుకు బాంబు | 57 |
| 29. | హమారా షహర్ హైదరాబాద్ | 60 |
| 30. | మృగధర్మంగా మనం | 63 |
| 31. | కాలం | 65 |
| 32. | చెప్పొద్దూ | 66 |
| 33. | నేనంటే | 67 |
| 34. | పరమార్థం | 70 |
| 35. | విజ్ఞాన వీచిక | 71 |
| 36. | తరుణ కిరణం | 73 |

**డా॥ఎన్.గోపి**

**పూర్వ ఉపకులపతి(పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం)**

**విశ్రాంత ఆచార్యులు,**

**ఉస్మానియా విశ్వవిద్యాలయం-హైద్రాబాదు**

# విత్తనకోశం

సున్నితమైన హృదయమే గట్టిగా కూడా మాట్లాడుతుంది. మృదువైన భావనలు, నిర్మొహమాటమైన అభిప్రాయాలు జ్ఞానేశ్వర్ కవిత్వంలో ఉన్నాయి. తెలంగాణ రాష్ట్ర పుష్పమైన తంగెడుపూలతో మొదలై అనేక వస్తు వైవిధ్యంతో అలరారుతున్న కవితలివి.

**"దు:ఖంతో నాకు చిరకాల స్నేహం ...**
**......... నాకు మాత్రం కన్నీరు**
**ద్రవీభూతమైన అమ్మ హస్తాలు"**

చిరకాల స్నేహంలోనే కవి బాల్యం నుంచి అనుభవించిన బాధామయ నేపథ్యాన్ని ఊహించుకోవచ్చు. **'వెలుతురు ముద్ద మా అమ్మ'** అన్న కవితలో

**'చందమామను తాకిరమ్మని నన్ను**
**అంతెత్తుకు ఎగరేసి**
**అలవోకగా అందుకొని**
**హృదయానికి హత్తుకున్న అమ్మ**
**ఇప్పుడు బురదలో ఇరుక్కున్న**
**చందమామయై బిక్కుబిక్కుమంటుంది'**

ఈ పంక్తులు కవిగా జ్ఞానేశ్వర్‌ను చందమామంత ఎత్తున నిలబెడతాయి.

జ్ఞానేశ్వర్‌కు తెలంగాణ అంటే ఆరోప్రాణం. ఉద్యమకాలం నుండి తెలంగాణ రాష్ట్రసిద్ధి దాక అనేక పత్రికల్లో అనేక కవితలు రాశాడు. జ్ఞానేశ్వర్ సామాజిక స్పృహ పరిణతికి దూరంగా ఏమీ లేదు. “ఓటు” ను గురించి ఎంత బాగా చెప్పాడో చూడండి.

**“ప్రజల చేతుల నుండి**
**జారిపోయే ఆయుధం**
**ఒక్కరోజు మురిపెం**
**ఐదేళ్ళ దు:ఖం**
**ఓటు”**

‘దిగంబర దేహం కాదది–చిదంబర దేహం’ అంటూ ఓ కవితలో సాధారణ శారీరక దిగంబరుడిని మనకు చూపిస్తూనే సమాజంలోని వ్యక్తుల మనోవికారాలను బట్టబయలు చేస్తూ మానసిక దిగంబరులను మన ఎదుట నిలబెట్టిన తీరు దిగ్భ్రమకు గురిచేస్తుంది. వేమన కవితా తాత్త్వికతకు ఇది దగ్గరి పోలిక. అలాగే ప్రముఖ కవి నా ప్రియమిత్రుడు వేణు సంకోజు గురించి రాసిన కవిత వేణు వ్యక్తిత్వాన్ని సుబోధకం చేస్తుంది.

**“తెలంగాణ వీణ ఒక్కటే**
**తంత్రులు నాలుగున్నర కోట్లు”**

–అనడం దాశరథి కన్న కొత్తదిగా ఉంది. కార్గిల్ కవితలో...

**‘మౌనం**
**ఇంధనం నింపుకుంటున్న**
**యుద్ధవిమానం”** అంటాడు. ఢిల్లీని ‘గద్దె మైసమ్మ’ అనడంలో అతని రాజకీయ చైతన్యం ద్యోతకమవుతుంది. చివరగా ‘తరుణ కిరణం’ పేరిట చనిపోయిన స్నేహితుడి గురించి రాసిన ఎలిజీ గుండెలను పిండేస్తుంది.

**“వాడిప్పుడు**
**మా గుండెగోడకు**
**కాలం వేలాడదీసిన ఓ చిత్రపటం”**

ఇలా ఏ కవితను ముట్టుకున్నా జ్ఞానేశ్వర్ కవిత్వంలో ఆర్ద్రత, సామాజికత, భావుకత, దేశీయత నాలుగుపేటల హారంగా అమరుతాయి.

జ్ఞానేశ్వర్ ఉస్మానియా విశ్వవిద్యాలయంలో తెలుగుశాఖలో నా పూర్వ విద్యార్థి. వినయసంపన్నుడు. గతంలో ఓ శతకం రాశాడనుకుంటాను. ఇప్పుడు చక్కని వచన కవితలతో మనముందుకు వస్తున్నాడు. అయితే ఈ సందర్భంగా నాదో చిన్న సలహా. కవితాత్మకతలో ఎంత అభినివేశం వుందో అదే స్థాయిలో శిల్పశ్రద్ధ అలవరుచుకోవలసి ఉంది.

జ్ఞానేశ్వర్‌కు నా హృదయపూర్వక ఆశీరభినందనలు.

**19-09-2016** **- ఆచార్య ఎన్.గోపి**

**డా॥అమ్మంగి వేణుగోపాల్**
కాళోజీ నారాయణరావు పురస్కార గ్రహీత
కేంద్రసాహిత్య అకాడమీ సలహా సంఘసభ్యులు

11-9-318, లక్ష్మీనగర్ కాలనీ
వీథి నెం.4, కొత్తపేట
సరూర్‌నగర్, హైద్రాబాదు - 35
సెల్: 94410 54637

# పరకాయప్రవేశం తెలిసిన కవి

ఈనాటి తెలంగాణ కవి సవ్యసాచి. అటు పద్యకవిత్వాన్ని, ఇటు వచన కవిత్వాన్ని సమదృష్టితో సంధించగలడు. గత వైభవాన్ని మీటి పునర్నిర్మాణాన్ని చాటగలడు. వస్తువైవిధ్యాన్ని, శిల్పవైవిధ్యాన్ని ప్రదర్శించగలడు. దాసోజు జ్ఞానేశ్వర్ కవిగా ఇప్పటికే పాఠకులకు చిరపరిచితులు. ఇప్పుడీ **"మిన్నంటి ఎగరటానికి"** అన్న వచన కవితాసంపుటితో తన పరిచయాన్ని గాఢతరం చేయటానికి పాఠకుల ముందుకు వస్తున్నారు. **'వెలలేని పూలు'** కవితలో-

**'బహుజనుల జీవితాలను**
**బతుకమ్మలా పేర్చుకోవటమెలాగో**
**నేర్పిన పువ్వులు'**

గా తంగేడుపూలను నిర్వచించటం ద్వారా తెలంగాణ సంస్కృతి మూలాలను బలంగా చెప్పగలిగారు జ్ఞానేశ్వర్.

జ్ఞానేశ్వర్ ఉపరితలం మీద పల్టీలు కొట్టే కవి కాదు. అంతర్దృష్టి వున్న కవి. మన పూర్వీకులు రాత్రిపూట ప్రయాణాల్లో నక్షత్రాలను లక్ష్యంగా చేసుకొని గమ్యాలను చేరుకునేవారట. 'జ్ఞాపకాల లాకర్' అన్న కవితలో-

**"అంతులేని ఆకాశం కింద**
**ఆశల నక్షత్రాలే దిక్సూచిగా ప్రయాణిస్తూ**
**ఒకరి కళ్ళల్లో మరొకరం**
**వెన్నెల పూలు ఏరుకొంటాం"** అంటున్నాడు కవి. జీవితంలో

ఎదురయ్యే కష్టాల ప్రభావంతో మరింత వేదనకు గురవటం ద్వారా సాధించేది నిరాశనే. కాని, కష్టాల్ని చిరునవ్వుతో ఆహ్వానించటం ద్వారా ఆ తీవ్రతను తగ్గించుకోగలుగుతున్నాడు. తనలోని ఆశావాదాన్ని రక్షించుకోగలుగుతున్నాడు. ఈ తాత్త్వికతకు ఉదాహరణప్రాయంగా ఉన్న పాదాలివి. ఇట్లా రాయగలగటం, అందులోనూ కవితాత్మకంగా రాయగలగటం పరిణతి చెందిన కవికే సాధ్యం.

కళాకారుడు సృష్టించిన జగత్తు కాలాంతరాన కూడా సౌందర్యాన్ని కోల్పోదు. మహాకవి జాన్‌కీట్స్ "ODE ON A GRECIAN URN" అన్న మహాకవితను రచించాడు. చితాభస్మం వున్న ఒక శిలాపాత్ర మీద చెక్కిన చిత్రాలలో ముఖ్యమైనవి– యువతిని యువకుడు వెంటాడే దృశ్యం ఒకటి కాగా, మురళిని వాయించే యువకుడిది మరొకటి. ఇప్పుడు వీళ్ళెవరూ సజీవులై లేరు. కాని, శిల్పంలో ఆ యువకుడు యువతిని ఇంకా వెన్నాడుతూనే వున్నాడు. ఇది దృశ్య సంబంధమైన అనుభవం. మరో యువకుడు ఇంకా మురళిని వాయిస్తూనే వున్నాడు. ఇది శ్రవణ సంబంధమైన అనుభవం. జ్ఞానేశ్వర్ రాసిన '**మైనపు శిల**'లో

**"ఆ స్తంభం పైన అష్టవిధ నాయికలు**
**అరమోడ్పు కనులతో**
**దూరమైన నీ స్పర్శను**
**జారిపోయిన మధురభావనలను**
**వెదుకుతున్నట్లున్నారు"**

అంటున్నారు. కవితలో అష్టవిధ నాయికలున్నారు. కాని, నాయకుడు లేడు. కవి దృష్టిలో వాళ్ళను చెక్కిన శిల్పే ఆ నాయకుడు. తమను చెక్కుతున్నప్పుడే నాయికలు అతనితో ప్రేమలో పడ్డారు. వందలేండ్లు గడిచిపోయినా, ఆ శిల్పి గతించిపోయినా త్వగింద్రియ జ్ఞానంతో స్పర్శకోసం ఆరాటపడుతూనే వున్నారు. ఊహాప్రపంచంలో మధుర భావనల స్మృతులతో ఆ నాయికలు శిల్పిని అన్వేషిస్తున్నట్టే వున్నారంటున్నాడు కవి. ఈ సజీవ వర్ణన అనిర్వచనీయ కళాశక్తికి కవి ఘటించిన అంజలి.

చెట్టు, ప్రకృతి, ఆకుపచ్చదనం–వంటి మాటల వెనుక వున్నది మనిషి

చైతన్యం. ప్రాణాధికమైన బాధ్యత. 'శివోహం' అన్నది నిన్నటి ఆస్తిక భావమైతే **'వృక్షోహం'** అన్నది నేటి ఆస్తిక భావం.

**'చెట్టు లేక నీవు లేవు**
**నీ పుట్టుక 'వేరు' - చావు నేలరాలిన 'పండుటాకు'**
**చావు పుట్టుకల మధ్య నీ బతుకు**
**ఓ మహావృక్షమే కదా"**

అన్న సాధారణీకరణంలోని ప్రతీకాత్మకత కవి కవిత్వశక్తిని నిరూపించేవి. మనిషికి ఒక 'నీడ' కావాలి. ఈ నీడ ఎండనుంచి కాపాడుతుంది. కష్టాల నుంచి కాపాడుతుంది. వంశవృక్షాల మీదుగా పయనించిన కవి–

**'ఎండి పిండిలా రాలే 'లైలప్ప' కాకుండా**
**ఈ భూమిని కాపాడుకుందాం'**

అంటున్నాడు. శాస్త్రీయంగా ఓజోన్‌పొరదాకా పోయి, భూమి ఒక ఆటవస్తువు కాకుండా దాన్ని స్థిర కక్ష్యలో నిలిపే శక్తి కూడా చెట్టుకు వుందంటున్నాడు కవి. 'లైలప్ప'ను భూమికి సమానార్థకంగా, ఆలంకారికంగా తొలిసారిగా వాడిన కవి జ్ఞానేశ్వరే అనుకుంటాను. ఇట్లా కవిత్వావరణంలో కొత్తదనాన్ని Plant చేయటం కూడా కవి బాధ్యత.

**'మిన్నంటి ఎగరటానికి'** కవిత పతంగికి సంబంధించిన వ్యవహారమే అయినా మానవుడు ప్రదర్శించవలసిన తెగువను, అభివృద్ధి పథంలో సాగటానికి ప్రదర్శించవలసిన సాహసాన్ని అన్యాపదేశంగా చెప్పే కవిత. పైకి పోయినా కొద్దీ ఆక్సీజన్ తగ్గిపోయే గడ్డుస్థితిలో, ఎవరినైనా సజీవంగా వుంచేది వారి పోరాటఫలితమే. ఈ పటిమను ప్రదర్శించే ఎవరినైనా చూసినప్పుడు కవికి 'ఆత్మ ప్రదక్షిణం' చెయ్యాలనిపిస్తుందట! ఈ ఆత్మ ప్రదక్షిణం భూమి లక్షణం. ఈ భావనతో కవిత కాన్వాస్ మరింత విస్తృతి పొందింది.

నాగరిక ప్రపంచంలో మనిషి అనాదిగా కొన్ని విలువలను అమలు చేస్తున్నాడు. వస్త్రధారణ అందులో ఒకటి. సభ్యతకు అది సూచన. అయితే,

సభ్యప్రపంచం ఒకటుందన్న స్పృహలేని ఒక మనోవ్యాధి పీడితుడు దిగంబరంగా మనమధ్య తిరిగితే ఎట్లా వుంటుంది? ఒక పెద్ద ఆలోచనల తేనెతెట్టె నుంచి తేనెటీగలు లేచి మనల్ని కుట్టటం ప్రారంభిస్తాయి. సభ్యతకు అసభ్యతకు మధ్య సంఘర్షణ చోటు చేసుకుంటుంది. ఇప్పుడు అసభ్యత అనుకుంటున్నది ఒకప్పటి ఆదిమ దిగంబర సంస్కృతే. సభ్యసమాజం వస్త్రధారణ చేస్తున్న మాట నిజమే కాని, దాని మానసిక చిత్తవృత్తి అసభ్యంగా వుంటున్నది. దిగంబరునిలో అసభ్యతలేదు. పైగా శిశువులోని నిసర్గ అమాయకత్వం దర్శనమిస్తుంది. పై వైరుధ్యాల దర్శనాన్ని మనోవిజ్ఞాన శాస్త్రంలో ప్రతిక్షేపన తంత్రం అంటారు. ఇక్కడ కవి దిగంబరున్ని ఆధారంగా చేసుకుని సభ్యసమాజంలోని కుళ్ళును విమర్శిస్తున్నాడు. ఇట్లాంటి సున్నితమైన కవితావస్తువుల నిర్వహణ సవాళ్ళతో కూడి వుంటుంది! 'మృగధర్మంగా మనం' కవితలో కూడా ఈ ఛాయలున్నాయి.

తన ఆరోగ్యాన్ని పణంగా పెట్టి 1969 మొదలు 2014 దాకా తెలంగాణ ఉద్యమంతో మమేకమై పోరాటాలు చేసిన కవి, సంఘజీవి వేణుసంకోజు. 'వీర తెలంగాణ' పత్రికను అసిధారావ్రతంగా నడిపిన ధీశాలి. సామాజిక సాహిత్య చైతన్యాల సాధనలో నిరంతరం నిస్వార్థంతో కృషి చేస్తున్న మనస్వి మన వేణుసంకోజు. 'విజ్ఞాన వీచిక' కవితలో–

**'శ్రమజీవుల స్వేదబిందువుకే**
**సతతం సలాం చేస్తూ**
**ఎగసిపడే అలలోపలి సముద్రం'**

అన్న పంక్తులు వేణుసంకోజు సమున్నత వ్యక్తిత్వానికి సాటికవిగా జ్ఞానేశ్వర్ వెలువరించిన సార్థక నీరాజనంగా నేను భావిస్తున్నాను.

మంచి భవిష్యత్తు వున్న దాసోజు జ్ఞానేశ్వర్‌కు అభినందనలు.

**03-03-2016** **– డా॥అమ్మంగి వేణుగోపాల్**

**ఓమ్ సాయిరామ్**

అభినవపోతన, సాహిత్యప్రపూర్ణ
**డా॥కూరెళ్ళ విఠలాచార్య**
ఎం.ఎ.బి.ఇడి.ఎం.ఫిల్.పిహెచ్.డి.
సెల్ : 99495 39765

సాయి సాహితీ కుటీరం
గ్రామం: వెల్లంకి
మం: రామన్నపేట
జిల్లా : యాదాద్రి భువనగిరి

# ఊపిరి పోసుకున్న అక్షరాలు

**గర్వము లేనివాడు, అపకారము తెల్యనివాడు, సాహితీ**
**పర్వము పైన లెస్స మధుభావము కల్గినవాడు, మంచియే**
**సర్వమటన్న సూక్తికిల సాక్షిగ నిల్చినవాడు, మాన్యుడున్**
**సర్వజనాళి మెచ్చిన విశాల హృదుండు, దసోజు చంద్రుడున్**

– ఈ పద్యము శ్రీ దాసోజు జ్ఞానేశ్వర్‌గారి తొలికృతి 'శ్రీదళము' ఆవిష్కరణ సభ (15–06–2014) లో నా ప్రసంగంలో చెప్పినది. ఇది ఎంతమాత్రం అతిశయోక్తి కాదు. అక్షరాలా స్వభావోక్తి. జ్ఞానేశ్వర్ నల్లగొండ జిల్లాలో ఉత్తమ ఉపాధ్యాయుడుగానే గాకుండా, కవిగా, రచయితగా, విమర్శకులుగా, సమీక్షకులుగా, వక్తగా, వ్యాఖ్యాతగా, సభాసమన్వయకర్తగా, యోగాచార్యులుగా, తెలంగాణ ప్రభుత్వ పాఠ్యగ్రంథ రచయితగా బహు ఉత్తమత్వం సంతరించుకున్న ప్రసిద్ధులు. వీరి తొలికృతి **'శ్రీదళము'** శతక సాహిత్యంలో హృద్యమైన పద్యకృతిగా మాన్యులచేత, సామాన్యులచేత మన్ననలు పొందిన ఉత్తమ కృతి.

ప్రస్తుత కృతి **'మిన్నంటి ఎగరటానికి...'** వీరి మలికృతి. ఈ గ్రంథం ద్వారా జ్ఞానేశ్వర్ పద్యకవితా రచనలోనే కాదు, గద్యకవితా రచనలోనూ సిద్ధహస్తులని నిరూపించుకున్నారు. నాకు దృష్టి అంతగా లేకపోవడం వల్ల రచయితనే కృతిలోని కవితాశకలాలనన్నింటిని వినిపించారు. నేను మిక్కిలి శ్రద్ధతో వాటిని నా మనసారా ఆస్వాదించాను. నిజం చెప్పాలంటే 'మిన్నంటి ఎగరటానికి..' కావ్యంలోని

కావ్యఖండికలన్నీ నన్నెంతో తన్మయుణ్ణి చేసినవి. నేనిప్పటికి వివిధ ప్రక్రియలలోనున్న చాలా కావ్యాలు చదివాను. నన్నెందుకో ఈ కావ్యం వినూత్నంగా, విలక్షణంగా ఆలోచింపజేసింది. మా జ్ఞానేశ్వర్ తొలి గద్యకవితా కృతిలోనే 'ఎంత ఎత్తు ఎదిగాడబ్బా!' అని ఆశ్చర్యపడ్డాను. ఈ చిరంజీవుని పట్ల నాకున్న ఆప్యాయత వల్లనేమో నాలో నేను గర్వపడ్డాను కూడా.

ఈ కావ్యంలోనున్న ఖండికలన్నీ నన్ను ఆకట్టుకున్నవే. మచ్చునకు కొన్నింటిని మాత్రం ఉదహరిస్తాను.

**'మా అమ్మ మోసుకొచ్చిన**
**ఎర్రమట్టి తట్టమీన బంగారుశిఖరం'** – ఈ కృతి **'వెలలేని పూలు'** మొదటి శీర్షికలో చెప్పిన ఈ రెండు కవితా పంక్తులు అతి సామాన్యులకు అందుబాటులో ఉండే, అడవినిండా విరబూసే తంగేడుపూల ప్రాశస్త్యాన్ని అపురూపంగా చెప్పడమే కాదు; అనితర సాధ్యంగా చెప్పారు.

**'మేము మధ్యతరగతి జీవులం**
**రోగమైనా, కష్టమైనా ఏదైనా కానీ**
**మందహాసాన్నే మందుగా వాడతాం'**

– **'జ్ఞాపకాల లాకర్'**లో హృదయం తరుక్కుపోయే విధంగా చెప్పిన ఈ జ్ఞాపకం సహృదయ పాఠకుణ్ణి కన్నీళ్ళు పెట్టిస్తుంది.

**'చిగురంటే**
**చిన్నదో మరి లేతదనో కాదు**
**విస్తారమైన భవిష్యత్తుకు**
**విత్తనకోశం'** – **'చిగురు'** శీర్షికలో ప్రాణికోటి సంతతిని నిలబెట్టటానికి చిగురే ఊపిరి. అందుకేనేమో ఓ వంశం రక్షించబడాలంటే వంశాంకురం ఉండాలంటారు. ఈ విషయాన్ని పై పంక్తుల్లో 'విత్తనకోశం' అనే ఓ విచిత్ర ప్రయోగం ద్వారా పటిమను అబ్బురపరిచారు.

**'నిలువెత్తు స్తంభాలపై**
**అందమైన శిలాలతలను పాకించావు**

**యుగాంతాల దాకా**

**వికసించే పూలు పూయించావు**

**పరిమళాలను మాత్రం**

**మా గుండెలకు అద్దినావు'** – 'మైనపు శిల'లో శిల్పి తన చెక్కడాల ద్వారా కడచిన యుగాల చరిత్రను భద్రపరుస్తూ ఇప్పటి చరిత్రను ముందు తరాలకు అందించిన తీరును దాసోజు వారు కవితాత్మకంగా కమనీయంగా చెప్పారు.

**'మమ్మల్ని నిలబెట్టటానికి**

**నడికట్టు కట్టుకున్న అమ్మ**

**ఇవాళ తానే వంగిపోయింది' – 'వెలుతురు ముద్ద మా అమ్మ'**లో చెప్పిన ఈ పంక్తులు అమ్మ వాత్సల్యానికి, త్యాగమయ జీవితానికి నిలువెత్తు నిదర్శనం. రచయిత అమ్మపట్ల తనకున్న ఆర్ద్ర హృదయాన్ని మహార్ద్రంగా ఆవిష్కరించారు.

**'చెట్టులేక నీవు లేవు**

**నీ పుట్టుక 'వేరు' – చావు నేలరాలిన 'పండుటాకు'**

**చావు పుట్టుకల మధ్య నీ బతుకు**

**ఓ మహావృక్షమే కదా!' – 'వృక్షోహం'** ఖండికలో కవి పర్యావరణ పరిరక్షణ ప్రాముఖ్యాన్ని గుర్తు చేయడమే కాకుండా, 'పండుటాకు–వేరు'లను చావుపుట్టుకలకు ప్రతీకలుగా చెప్తూ జీవిత పరమార్థాన్ని వ్యక్తం చేశారు.

**'మిన్నంటి ఎగరటానికి**

**వెన్నంటే తోకచాలనే దాని విశ్వాసాన్ని**

**తెగదెంపుల దారం వమ్ము చేయలేక పోయింది**

**దాని ఆత్మబలానికి నా సాష్టాంగ నమస్కారం'**

– ఎవరైనా బలవంతుడు వెన్నుదన్నుగా ఉంటే ఎంత బలహీనుడైనా ముందుకు వెళ్ళడానికి ఎంతో ఆత్మ విశ్వాసాన్ని కలిగి ఉంటాడనే అంశం 'మిన్నంటి ఎగరటానికి వెన్నంటి ఉండే తోక' చాలని కవితలో సాక్షాత్కరిస్తుంది.

**'వేలెడంతలావు తీగకు గుమ్మడికాయలు**

**మర్రిమానుకు రేగు పళ్ళంత కాయలను కాయిస్తున్న**

**నీ సృష్టినీ, సృష్టి రహస్యాన్నీ పొగడాలనీ ఉంది..'**

– 'మఱ్రి మహావృక్షం నుండి రేగుపండంత పండు రావడం, సన్నని గుమ్మడి తీగ నుండి చాలా పెద్దదైన గుమ్మడి కాయ రావడం' ఆలోచిస్తే మహాశ్చర్యంగా ఉంటుంది. ఇలా కనిపించే సృష్టి యొక్క వైవిధ్య, వైచిత్రాలను కవి ఈ కవితలో కళ్ళకు కట్టి చూపించాడు.

స్వర్ణకారుల వృత్తి బంగారపు పని అయినా ప్రస్తుతం జీవితం మాత్రం బాధాకరం. ముందస్తు తయారీ (రెడీమేడ్) ఆభరణాలు వచ్చిన తర్వాత పనులు లేక పస్తులు పండుకొనే దుస్థితి అనుభవిస్తున్నారు. ఆ దయనీయ పరిస్థితే ఈ ఖండికలో **'బొగ్గుల కుంపటి రాజుకోకపాయె / కడుపుల కుంపటి ఆరకపాయె'** అంచు రచయిత ఆర్ద్రమైన కవితను ఆవిష్కరించారు.

**'అంటుకడుపు'** కవితలో వినాయకుణ్ణి కవితా వస్తువుగా తీసుకొని ఇప్పటి దురాశ నాయకుల స్వార్థజీవితాన్ని తూర్పారబట్టారు. ఆ సందర్భంలోనే నాయకుల అక్రమార్జనను పూసగుచ్చినట్టు చెబుతూ **"వినాయకా నీ బొజ్జలో ఉండ్రాళ్ళు, లడ్డూలు, కుడుములు, పాయసం, ఒడపప్పు...ఇలా ఏ పూటకాపూట అరిగే పదార్థాలే ఉంటాయి, కాని మా నాయకుల బొజ్జలనే బ్యాంకుల నిండా**

**'గుట్టుగా తిన్నవి కొన్ని**
**గుంజుక తిన్నవి కొన్ని**
**పిల్లిలా నాకింది కొంతే**
**కుక్కలా గతికింది ఎంతో'"** అంటూ నల్లధనం దాగివున్న సత్యాన్ని చక్కగా చెప్పారు.

ఇలా ఈ కావ్యం నిండా కొత్త ఒరవడిలో కొంగొత్త భావాలతో ఆబాల గోపాలాన్ని ఆకట్టుకొనే విధంగా జ్ఞానేశ్వర్ తన కవితా వ్యాసంగాన్ని సాగించారు.

''ముళ్ళతో గీరుతూ ఆకులతో విసరుట, మౌనం ఇంధనం నింపుకుంటున్న యుద్ధ విమానం, ముందలూరుకు దగ్గరయిన కొద్దీ వెనకూరు దూరమయిందన్నట్లు, హృదయానికి ఆకుముడత తెగులు, బురదలో ఇరుక్కున్న

చందమామ, పాషాణం కూడా అరిగి కరిగి పారుతుంది..."మొదలగు సరికొత్త ప్రయోగాలు సహృదయుల హృదయాలలో చాలా కాలం భద్రంగా ఉంటాయి.

ఇంత చక్కటి కావ్యాన్ని రాసి తెలుగు సారస్వత లోకానికి అందించిన శ్రీ దాసోజు జ్ఞానేశ్వర్, వారికి అన్నివిధాల సహకారమందించిన వారి ధర్మపత్ని శ్రీమతి పద్మ, చిరంజీవులు శర్వాణి, శ్రీవాణిలు ఎంతో అభినందనీయులు. వీరందరకు నా ఆశీరభినందనలు.

ఉత్తరోత్తర వీరి కలం నుండి ఇంకెన్నో కావ్యాలు వెలుగు చూడాలని ఆకాంక్షిస్తూ నా యిష్టదైవమైన శ్రీశ్రీశ్రీ షిరిడీ సాయిబాబా అనుగ్రహించుగాక అని వేడుకుంటున్నాను.

**విజయోస్తు!**

**20-09-2016** **- డా॥కూరెళ్ళ విఠలాచార్య**

**వేణు సంకోజు**
**ప్రముఖకవి, విమర్శకులు**
**సెల్: 99484 19881**

**శ్రమాశ్రమం**
**5 ఎల్ఐజి, హెచ్‌బి కాలనీ**
**రాజీవ్ పార్కు దగ్గర**
**నల్లగొండ - 508001**

# సూటిగా సారించిన
# 'అక్షరాంబువు'

కాలావధుల్ని దాటి అనునిత్యం, వినిర్మలమైన పావురంతో వికసిస్తూ వచ్చే అగ్నివంటి వెలలేని "తంగెడుపూల"ను ఉద్యమ జీవితాలకు ప్రతీకాత్మకమూ, ప్రామాణికమూ అయిన ఆనవాళ్ళుగా నిలుపడంతో ప్రారంభమౌతుందీ కవితాసంపుటి. ఈ కవి ప్రకారం అసలు-సిసలు పూలంటే యివే. అమ్మ మోసుకొచ్చిన ఎర్రమట్టి తట్టమీద "బంగారు శిఖరం"గా ఆరాధిస్తున్నాడు. వీటిని **"బహుజనుల జీవితాలను / బతుకమ్మలా పేర్చుకోవటమెలాగో / నేర్పిన పువ్వులివ"**ని పేర్కొంటూ, విలువలేనివి కావివి "వెల లేనివి - తులలేనివి" అని కీర్తిస్తాడు.

ఈ సంపుటిలోని కవితాంశాల జాబితా పెద్దది, విభిన్నమైనవి కూడా. ప్రతిపాదించనెంచిన అంశాలనెక్కడా ఎటువంటి మొహమాటం లేకుండా, పాఠకుని జ్ఞానేంద్రియాలలోకి సూటిగా చేరవేసి, అందుకనుగుణంగా కర్మేంద్రియాలూ పూనిక వహించేటువంటి స్ఫూర్తినీయగలిగినాడీకవి. అక్షరాలకు అత్తరులనద్ది, అనుభవాల నెనరుతో గుబాళించే వాటిని జనావర్ణవంలోనికి ప్రవేశపెట్టే నేర్పుతో కవితా సృజన చేయనెంచిన ప్రగాఢమైన ఆకాంక్ష ఈతనిది; సాదరంగా స్వాగతించతగినది. ఈ కవితా సంపుటిలో- మానవుని విలువలు - కువిలువలు - సంఘపు రీతులు - దుర్నీతులు, ప్రపంచపుటుత్థాన పతనాలు, రాజకీయాల కిచకిచలు - డాబులు - ఊబీలు; సమసి పోవాల్సిన దురాలోచనలు - విస్తరించవలసిన మహితత్వాలను గురించి, దయతో-సానుభూతిగానూ, స్పష్టంగా అన్నింటికన్నా మిక్కిలి అబ్సల్యూట్

హానెస్టుగానూ చోటు చేసుకున్నాయీ రచనలు. 2005 నుండి 2016 దాకా రాసుకున్నవీ – పత్రికల్లో చోటు చేసుకున్నవి. వీటినొక విధంగా, ఈ కవియే వడపోసుకొని కూడా వున్నట్టున్నాడు. కనుకనే, ఈ అమ్ములపొదిలో – చిలుమెక్కిన అస్త్రాలగుపించవు; వ్యర్థాలకు అంతకన్నా చోటుండదు.

ఇందులోని "జ్ఞాపకాల లాకర్"వంటి శీర్షికలతో బాటు – మైనస్‌నా, నిక్కాక, సీగుడ్డు, ఇలాంటి వాడొకడుంటాడు, అంటుకడుపు, మెతుకుబాంబు, వృక్షోహం వంటి విభిన్నమైన రచనలు ఆలోచింప జేస్తున్నవి. తక్షణం ఈ సంపుటిలోని కవితల్లోకి ప్రవేశించేట్టుగానూ ప్రోత్సహిస్తూ వున్నవి.

ఇంకే మార్గమూ లేనప్పుడీ కవి– మధ్యతరగతి జీవులు మందహాసాన్నే మందుగా వాడే ఉత్తమారోగ్య స్థితిని గురించి పేర్కొంటున్నాడు. అణువణువునా అనురాగమే ఆచ్ఛాదన అయినప్పుడు, సహజంగానే బొంత చిల్లులు కాస్తా అంతరిక్షపు నక్షత్రాలై తోచే రామణీయకతను కళ్ళకు కట్టిస్తున్నాడు. పెదాలపై పూసే పువ్వులను కళ్ళతో చల్లుకుంటూ రమ్మని ఆదరంతో ఆహ్వానిస్తున్నాడు.

"అవునూ, నేను మైనస్‌నా?!" అని ఆశ్చర్యంగా ప్రశ్నవేస్తూ, మళ్ళీ తనను తానే సమాధాన పరుచుకుంటూనన్నట్లు – **"అమ్మా నాన్న తోబుట్టువుల హృదయాల్లో / నిజంగా ప్లస్‌నవుతాను"** అని తేల్చుకుంటున్నప్పుడు విశేషంగానూ విభిన్నంగానూ ధ్వనిస్తున్నది. అయితే **"పతిలో సగం కావటానికి / సొంతం మైనస్‌గా మారినా / వంశాంకురాన్నిచ్చిన / ప్లస్‌ను నేను"** అంటున్నప్పుడు యిదేదే పైథాగరస్ సిద్ధాంతానికి బంధువులా ధ్వనిస్తున్నది – చిత్రంగా. అట్లాగే, **"అద్దగీత లేని నిలువు గీతను చూడండి / అప్పుడాయన ఆశ్చర్యార్థకమే కదా!"** అంటున్నప్పుడు గట్టి లాజికొకటి ధ్వనిస్తున్నది! కొనసాగింపుగా ఇదే కవితలో **"నేను మైనస్‌ను కాను / ప్లస్‌లో అర్థభాగాన్ని / సంతానంలో సార్థక భాగాన్ని / సంసారంలో సారాన్ని"** అనడమన్నది ఇంకొక విభిన్నమైన వ్యక్తీకరణ. మొత్తానికొక పక్కా లెక్కయిన మనిషిలా ధ్వనిస్తున్నాడీ కవి. ఇదే కోవలో అనికాదు గాని **"చిగురంటే / చిన్నదో మరి లేతదో కాదు / విస్తారమైన భవిష్యత్తుకు / విత్తన కోశం"** అంటుంటే గణితం వంటి ఒక గొప్ప ఉట్టంకింపు ధ్వనిస్తున్నది.

శిలలను గురించి చెప్పిన ఒక కవితలో **"ఉలి స్పర్శకు / పరవశించిన పరువాల రెమ్మలు / ఊహల్లో విరబూసిన అందాల విరికొమ్మలు"** అంటున్నప్పుడవి సుతారంగానూ, సౌందర్యతమంతోనూ మన కరాలను స్పర్శిస్తున్న అందమైన అనుభూతి. ఈ చెక్కడాల నిర్మాణాలను గావించిన శిల్పి – నిలువెత్తు స్తంభాల మీద, అందమైన "శిలాలతల"ను పాకించినవాడుట! క్యూడోస్!!

"అక్షరాంబువు" అనే శీర్షికే అదిరింది. గొప్ప వ్యక్తీకరణ కూడ. "ఓటు" చిన్నదే అయినా, ఆసాంతం కోట్ చేయదగింది. కొందరి కలుషిత పలకరింపులను కసిదీరా ఈసడించే ఈ కవి– **"పెదాలు విచ్చుకున్నా – హృదయానికి ఆకు ముడత తెగులు"** సోకడాన్ని గర్హించకుండా ఎలా వుంటాడు! అన్య మనస్కంగా విసిరిన అక్షతలకు తన శిరస్సు వంగదని కూడా తేల్చేస్తున్నాడు – కరాఖండిగా!

కన్నీటికొక కొత్త నిర్వచనమై చోటు చేసుకున్న కవిత– "నేను దు:ఖాన్ని!" "కళ్ళు చెమర్చని...రాయిగా వుండడానికీ పనికి రాదు" అనడమొక అంతిమ తీర్పు వంటి వ్యక్తీకరణ. దాని కొనసాగింపుగా, **"పాషాణం కూడా అరిగి కరిగి పారుతుంది / చరిత్రకు అద్దమై నిలుస్తుంది / దళసరి కాగితమై / భూత భవిష్యత్తులకు ప్రమాణ పత్రమౌతుం"**దనడం మంచి పదునుగా వుంది. అట్లాగే ఈ **"కన్నీరు కార్చడమంటే / బేలతనం కాదు / స్పందించే గుండె గుహలో / బొట్టు బొట్టుగా ఉట్టి / కంటి కాల్వలగుండా దూకుతున్న / కారుణ్య జలపాతం..."** అనడం, ముగింపుగా **"బతుకును చిగురింప జేసే సారం / కన్నీటిలో కూడా ఉందంటూ / ఆగిపోకుండా సాగిపోయే రహస్యం / సహనమేనని అమ్మయేగా నేర్పింద"**న్న తాత్త్విక వ్యక్తీకరణ మరీ మరీ యోచింపజేస్తున్నది. ఇదే కోవలోకొచ్చే గహనమైన అభివ్యక్తి **"మిన్నంటి ఎగరడానికి!"**.

ఇంకా చావకుండా పదే పదే అధ:పతనపు భావాల్తో, అంతకన్న మిక్కిలి అసహ్యకరమైన కదలికల్తో, అస్తమానం పేరుకీర్తులకని పడిచస్తూ, పూట పూటకొక కొత్త రోగంతో నన్నట్లు పుట్టుకొస్తూ, చెదలుకన్న పదిలంగా, నల్లులవలె ప్రచ్ఛన్నంగా, బండారం బయట పడినప్పుడు దొంగ పిల్లులుగా, తెల్లగా ఉబ్బి కదిలే లక్క పురుగులుగా, ఏదో విధంగా తమ కక్కుర్తితో, అంతకన్నా మిక్కిలి హీనమైన కండూతితో

పక్కలో బల్లాలై, పబ్బం గడవగానే అక్కడినుండి జారుకునే చోర శిఖామణుల తీరును ఎండగట్టిన కవిత – **"ష్‌ష్‌ష్!"**. అత్యంత తీవ్రమైన ధర్మాగ్రహమిది. ఇటువంటి యింకో రచనే – **"సీ గుడ్డు"**కాగా, కుహనా రాజకీయ నాయకుల చిత్రణే– **"యయాయా! వీరు..."**.

ఇక, యిందులో కొన్న భిన్నమైన వ్యక్తీకరణలు – **"లువధవె"** వంటివి బలంగా చోటు చేసుకొని వున్నాయి. **"అర్థమపార్థం"**–యింకో విభిన్నమైన వ్యక్తీకరణ. **"పరకాయ ప్రవేశం తెలిసిన వాణ్ణి / ఎందరి సుఖదు:ఖాలనో / నా గుండెకు లబ్‌డబ్‌గా చేసుకున్నవాణ్ణి"** అంటూ కొనసాగింది.

ఈ కవి తనువునిండా తెలంగాణతనం, మనసునిండా తెలంగాణ గుణం నిగూఢంగా చోటు చేసుకుని వుంటాయి. తెలంగాణ కొరకు జరిగిన త్యాగాలను గురించి తలవని వారిని ఈసడించుకున్నాడు. తెలంగాణ అవతరణను మన:పూర్వకంగా ఆహ్వానించని, అటువంటి తీవ్రాకాంక్షను లక్ష్యం చేయని వారిని కసిదీరా అసహ్యించుకున్నాడు. కనుకనే – రైతుదే తెలంగాణము, హమారా హూదరాబాద్, వలస తెలివి, రణగీతం, నిగ్రహం కూలింది, మేం తొడగొట్టకముందే, జనచేతన సునామీ, రాబందులోలె రాలిపోతవ్, సైరన్, అధిక పీడనం, బహుత్ ఖూబ్–బహుపరాక్, గద్దెవైనమ్మ, నవ్య దీపావళి – వంటి కవితలకు అవకాశమిచ్చుకున్నాడు. అదే తీక్షణతతో – ఆచార్య జయశంకర్, ప్రజాకవి కాళన్నలను గురించి గొప్ప స్ఫూర్తిమంతమైన కవితలకు ఈ సంకలనం (మిన్నంటి ఎగరటానికి) తో పాటు వెలువడుతున్న మరో కవితా సంకలనం **"రణగీతం"**లో వినమ్రంగా చోటిచ్చుకుని తీరినాడు.

అటు పద్యమూ, యిటు వచనరచనలోనూ – యిరుకెలంకుల దిట్ట యైన ఈ కవి యొక్క సహృదయ సాహిత్యవీథిలోకి సాదరంగా స్వాగతం పలుకుతూ...

**12-04-2016** **– వేణు సంకోజు**

# కృతజ్ఞతలు

'ఇవాళ ఏం రాశావ్! వినిపిస్తావా!' అంటూ రెండున్నర దశాబ్దాల క్రితం కొత్తగా, విరివిగా కవిత్వం రాస్తున్న నన్ను మరింతగా రాసేలా ప్రోత్సహించి, నేటి ఈ కావ్యానికి ఆశీర్వాదంతో 'విత్తన కోశం'గా ముందుమాట చెప్పిన పూజ్య గురుదేవులు ఆచార్య ఎన్.గోపిగారికి, సాహిత్యపరంగానే కాక సర్వవిధాల నా ఉన్నతిని కోరుతూ నన్ను నడిపిస్తున్నవారు, నా పట్ల సహృదయతా మాతృమూర్తిత్వంతో వ్యవహరించే కవికుల గురువు 'ఊపిరి పోసుకున్న అక్షరాలు'గా నా కవిత్వానికి కితాబిచ్చిన డా॥కూరెళ్ళ విఠలాచార్యగారికి, నా పద్యగద్య రచనలను ఆసాంతం చదివి 'పరకాయ ప్రవేశం తెలిసిన కవి'గా నన్ను అభినందించి, విలువైన ముందుమాటనిచ్చిన తెలంగాణ సాహితీ శిఖరం, తెలంగాణ ప్రభుత్వ తొలి కాళోజీ పురస్కార గ్రహీత డా॥అమ్మంగి వేణుగోపాల్‌గారికి, 'రాసినవన్నీ దాచిపెట్టు, మెరుపులనన్నీ మూటకట్టు – చిట్టెడు చిట్టెడే పుట్టెడవుతయ్' అని నా పుస్తకాలు అచ్చులో రావడానికి ప్రేరేపించడమే కాక, ఎన్నో వ్యాసాలు, కవితలు వివిధ పత్రికలలో రావటానికి ప్రేరణగా నిలిచి, 'సూటిగా సారించిన అక్షరాంబువు'గా నా కవిత్వాన్ని పేర్కొన్న మట్టి పరిమళంతో పూచిన మనీషి శ్రీ వేణు సంకోజుగారికి, నన్నక్కున చేర్చుకుని, నా ప్రతి పుస్తకానికి అందమైన ముఖచిత్రం అందించిన ప్రముఖ చిత్రకారులు మా బావ శ్రీ కూరెళ్ళ శ్రీనివాసులుగారికి, నా వెన్నుదన్ను శ్రీ పెందోట సోముగారికి, నా పెన్నుదన్ను డా॥ఎస్.రఘు మొదలగు వారికి కృతజ్ఞతాపూర్వక నమస్కారాలు.

ఈ **"మిన్నంటి ఎగరటానికి"** మరియు **"త్యాగాల తెలంగాణ"** జమిలికావ్య ముద్రణకు ఆర్థిక సాయమందించిన శ్రీ డా॥పాలువాయి భాస్కర్‌రావుగారికి, ఉత్తమ ఉపాధ్యాయ అవార్డుగ్రహీత శ్రీ కూరెళ్ళ వెంకటేశ్వర్లుగారికి, నా సహోపాధ్యాయులు శ్రీ సోమవరపు రాములుగారికి, శ్రీ ఐతగోని వెంకటేశ్వర్లుగారికి,

శ్రీమతి జి.అలివేలు మేడంగారికి, శ్రీజె.మధుగారికి, శ్రీ కె.అంజయ్యగారికి, శ్రీమతి ఎం.శశిరేఖ మేడంగారికి, శ్రీమతి ఎం.నాగమణి మేడంగారికి, శ్రీమతి ఎస్. ఇందిర మేడంగారికి, శ్రీమతి బి.రేవతి మేడంగారికి, శ్రీమతి పి.సావిత్రి మేడంగారికి, శ్రీమతి ఎం.సునీత మేడంగారికి, శ్రీమతి జాహెదాబేగం మేడంగారికి, శ్రీ చిక్కుళ్ళ రామలింగయ్య గారికి, శ్రీ కె.సుధాకర్‌రెడ్డిగారికి కృతజ్ఞతలు. కీ॥శే॥శ్రీమతి సులోచనగారి ఆత్మకు శాంతి కలగాలని భగవంతుణ్ణి కోరుకుంటున్నాను.

మా అమ్మ పరమపదించినపుడు నా స్థితికి చలించి నాకు అండగా నిలిచిన వదాన్య మిత్రులు, సహృదయులు, ఒకనాటి సహోపాధ్యాయులు, నేడు జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల–కొప్పోలు, మం.గుర్రంపోడులో గజిటెడ్ ప్రధానోపాధ్యాయులుగా విధులు నిర్వహిస్తున్న శ్రీ ఎం.జయరాజ్‌గారికి, అన్ని విధాలా, అన్ని వేళలా నన్ను ప్రోత్సహించే మా ప్రధానోపాధ్యాయులు శ్రీతాళ్ళపల్లి రవిగారికి కృతజ్ఞతలు.

నా తొలికృతి ‘శ్రీదళం’ను లోకానికి పరిచయం చేసిన శ్రీ పిట్ట మధుసూదన్‌రెడ్డి శ్రీమతి భారతమ్మగారలకు నమస్సులు.

ప్రతిభామూర్తి, శ్రమజీవి, వాగ్గేయకారుడు ప్రియమైన అన్న డా॥కృష్ణకౌండిన్యగారికి, నా కవిత్వాన్ని పరవశంతో విని ప్రోత్సహించే మృదుహృదయసంపన్న మిత్రుడు,కవి,రచయిత శ్రీ పెరుమాళ్ళ ఆనంద్‌గారికి, మిత్రుత్వం నెరపడంలో వయోభేదాలను గణింపని అగణిత ప్రేమమూర్తి, సహజ నటచక్రవర్తి శ్రీనల్లాన్ చక్రవర్తుల పార్థసారథి అయ్యంగార్ గారికి, నా మంచి కవిమిత్రుడు, అగణిత ప్రతిభాశాలి శ్రీ సాగర్ల సత్తయ్యగారికి, నా శ్రేయోభిలాషి బోళాశంకర బిరుదాంకితుడు శ్రీమాదగాని శంకరయ్యగారికి, అవధానం చేయగల శక్తిసామర్థ్యాలు సంతరించుకున్నా నా కవిత్వాన్ని ఆస్వాదించగల మిత్రుడు శ్రీఐతగోని వెంకటేశ్వర్లు గారికి కృతజ్ఞతలు.

“జనభారతి” సాహిత్య సంస్థ–నార్కట్‌పల్లి గౌరవాధ్యక్షులు శ్రీఅలుగుబెల్లి రామచంద్రారెడ్డిగారికి, అధ్యక్షులు శ్రీచొల్లేటి బ్రహ్మచారిగారికి, ప్రధానకార్యదర్శి

శ్రీరాధారపు భిక్షపతిగారికి, మరియు సంస్థ బాధ్యులందరికి పేరుపేరునా కృతజ్ఞతలు.

పాలమూరు జిల్లాలోని మిత్రులు శ్రీ కుంచకూరి బుచ్చిలింగం, శ్రీ ఎ.వెంకటయ్య, శ్రీ జి.శ్రీనివాసులు, శ్రీ రాజేందర్‌గౌడ్, వెంకటరాములుగౌడ్, శ్రీమతి లలితకుమారి, శ్రీమతి వనజ, శ్రీమతి వసంతకుమారి గారలకు ఆత్మీయ కృతజ్ఞతలు.

నా స్వంత జిల్లా నల్లగొండలో ఒక ఇంటిని కట్టుకోవడానికి 'ప్రేమసంతకం' చేసి నన్నో ఇంటివానిగా నిలిపిన శ్రీ చక్రవర్తుల వెంకటరమణాచారిగారికి, 'మైత్రీవనంలో వికసించే తాజా పూవు, ఆత్మీయ మిత్రుడు శ్రీఎల్.రాములుగారికి నమస్కారపూర్వక కృతజ్ఞతలు...ఇలా ఎందరో పాలమూరు మిత్రులు నన్ను స్వంత జిల్లానే మరిపించేంతగా ఆదరించినవారు; వారందరికీ పేరుపేరునా కృతజ్ఞతలు.

నా కవిత్వానికి మొదటి శ్రోత, సహధర్మచారిణి శ్రీమతి వీణ(పద్మ) కు, నా బంగారు తల్లులు చిరంజీవులు శర్వాణి శ్రీవాణీలకు ఆశీర్వాదాలు.

ఈ కావ్యాన్ని చదువ పూనుకుంటున్న మీకు సాదర స్వాగతం పలుకుతూ...

మీ

**దాసోజు జ్ఞానేశ్వర్**

## వెలలేని పూలు

తంగెడుపూలు
కాలానికి అతీతమైన అగ్గిపూలు
ప్రతీకాత్మక జీవితాలకు
ప్రామాణికమైన ఆనవాళ్ళు

పరిమళమే జీవితమనే క్షణకాలపు మిడిసిపాటుకు
ప్రతికూలంలోనూ ప్రతికాలంలోనూ
పరవశింపజేసే రహస్యమే దీని సమాధానం
అసలుసిసలు పూలు ఇవే
ఈ తంగెడుపూలు
అనుభవంతో మెరిసే
తాత నుదిటి ముడుతలు
ఆకుపచ్చని ముతకచీరలో గజనిమ్మ పండులాంటి
నిండైన నాయనమ్మ రూపానికి
అడవితల్లి పట్టిన హారతి

మా అమ్మ మోసుకొచ్చిన
ఎర్రమట్టి తట్టమీన "బంగారు శిఖరం"
"అంగట్లో అమ్ముడుపోయేవి గొప్పవా
అందరికి అందుబాటులో ఉండేవి గొప్పవా" అంటే
గుబురు మీసాల సాటున తారాడే నీ నవ్వులాంటి
ఈ తంగెడుపూలే నాకిట్టం" అంటూ
విరగబూసిన పచ్చని పూలమండనిరిసి
జడల చెక్కుకున్న నాయాలి చిలిపినవ్వులు
గోదారిలో సంగమిస్తున్న మంజీర గలగలలు

ఊరిబయట చెరువుకట్టమీన కూర్చుంటే
అలలమీద తేలివచ్చే పిల్లగాలులతో కలిసి
సయ్యాటగా వినిపించే సరదా ముచ్చట్లన్నీ
ఈ తంగెడుపూల
ఈ పేదపూల
ఈ ప్రేమపూల గుసగుసలే

బహుజనుల జీవితాలను
బతుకమ్మలా పేర్చుకోవటమెలాగో
నేర్పిన పువ్వులివి

ఆశయాలను ఆకాశంలో చుక్కలోలె మెరిపిస్తూ
నేలతల్లి ఒడిలో సేదదీరుతున్న అమరుల దేహాలకు
పూలపొత్తిలిగా మొలిచినవీ తెంగెడుపూలు
ఇవి అమరుల సమాధులమీన  అఖండ నివాళి
అందుకే విలువలేనివి కావు - ఇవి
"వెలలేనివి"
"తులలేనివి"

26-09-2015

# జ్ఞాపకాల లాకర్

మేము మధ్యతరగతి జీవులం
రోగమైనా కష్టమైనా ఏదైనాకానీ
మందహాసాన్నే మందుగా వాడతాం

మేము చిన్నజీతగాళ్ళం
అద్దెకొంపల్లో ఇరుకుగదుల్లో
ఒదిగొదిగి జీవిస్తుంటాం–అయితేనేం
ప్రియసమాగమ వేళల్లో ఇరుకుగదా అది !
ఇంద్రభవనమంత విశాలమవుతుంది
అణువణువునా అనురాగాన్ని
ఆచ్ఛాదనగా కప్పుకున్నవేళ
పాతబొంతకు చిల్లులా అవి
అంతరిక్షంలో నక్షత్రాలుగాని !

వారాంతంలో సినిమాలు షికార్లు
మాకు అచ్చిరావు అందిరావు
మూరెడుపూలు కొనాలంటే మావారు
మున్నూటరవైసార్లు ఆలోచిస్తుంటారు

అదితెలిసి
కాసేపట్లో వాడిపోయే పూలు
తెమ్మని నేనెన్నడూ అడుగను
పెదాలపై పూసే పువ్వులను
కళ్ళతో చల్లుకుంటూ రమ్మంటాను

ఇంకా...ఆదివారం కొరకు ఎదురుచూస్తుంటాం
ఆ రోజంతా వారాంతపు సమీక్షలే
ఒకరు తుమ్మెద–ఒకరు పూపొద
తేనె, పుప్పొడి తుమ్మెదపాలు
తియ్యనిగాట్లు, కమలిన కాంతులు
పూపొదపాలు
ఇలా పంచుకున్న అనుభూతులను
అలా గుండెగంపలోకి ఎత్తుకుంటాం
తరగని సంపదగా జ్ఞాపకాల లాకర్లో
భద్రంగా దాచుకొంటాం

మళ్ళీ మళ్ళీ
పున్నమిరోజులకై ఎదురుచూస్తుంటాం
విరిసిన వెన్నెల్లో విహంగాలమై తేలిపోతూ
పెదాలపై చమక్కున పూసే
నవ్వుపువ్వులపై ముద్దుగా
చకోరపక్షులమై వాలుతుంటాం

మేము తక్కువ జీతగాళ్ళం
కలలు కనడం చేతనైన వాళ్ళం
మేము మధ్యతరగతి జీవులం
అయినా స్వాప్నికశ్రీమంతులం
అలాఅలా అలల్లా పొంగిన, పొందిన
ఆనందానుభూతుల జలపాతాలను
ఇలాఇలా ఎదసంద్రంలోకి మళ్ళిస్తుంటాం
ఊహల కెరటాలమీద సాగుతూ
సదా ఆనందసంచారులమౌతాం
అంతులేని ఆకాశంకింద
ఆశల నక్షత్రాలు దిక్సూచిగా ప్రయాణిస్తూ
ఒకరి కళ్ళల్లో మరొకరం
వెన్నెలపూలు ఏరుకొంటాం
ఒకరి ఒడిలో ఒకరం
ఒడ్డుకుచేరిన నావికుల్లా సేదతీరుతాం
మేము మధ్యతరగతి జీవులం
కలలు కనడం చేతనైనవాళ్ళం, అందుకే
మేము 'స్వాప్నికశ్రీమంతులం'

08-02-2005

## మైనస్ నా !?

అవునూ, నేను మైనస్‌నా !?
ఆడబిడ్డనైనంత మాత్రాన
పెళ్ళిపేరుతో పుట్టింట్లో మైనస్‌నవుతానా !?
కాదు,కాదు
అమ్మానాన్న, తోబుట్టువుల హృదయాల్లో
నిజంగా ప్లస్‌నవుతాను
పతిలో సగంకావటానికి
సొంతం మైనస్‌గా మారినా
వంశాంకురాన్నిచ్చిన
ప్లస్‌ను నేను

అయినా
పిడికెడు చల్లితే
పుట్టెడై పెరిగే భూమాతను
మైనస్‌నెలా  అవుతాను !?
కాదు,కాదు,
ముమ్మాటికి నేను
"ప్లస్"లో భాగాన్నే
స్త్రీగా నేను అద్దగీతనైతే
పురుషుడుగా అతను నిలువుగీత
అద్దగీత లేని నిలువుగీతను చూడండి
అప్పుడాయన ఆశ్చర్యార్థకమే కద !?

అందుకే
నేను "మైనస్"ను కాను
"ప్లస్"లో అర్థభాగాన్ని
సంతానంలో సార్థకభాగాన్ని
సంసారంలో సారాన్ని

నేటినిజం
17-11-2011

# చిగురు

అంతపెద్ద మోడులో
ఇంతచిగురు
మోడువారిన జీవితాలకు
భవిష్యత్తుపై ఆశలు
చిగురింపజేయడమే

ఆశతో అలా
కాలగమనంలోకి
ఈదుకుంటూ వెళ్ళమని
సందేశమివ్వడమే

అమావాస్య చీకటిలోనూ
వెలుగును వెతకమని
వెన్ను తట్టడమే

చిగురంటే
చిన్నదో మరి లేతదనో కాదు
విస్తారమైన భవిష్యత్తుకు
విత్తనకోశం

## మైనపుశిల

ఓ శిల్పీ !
నా కంటికి శిలలవి
నీ చేతిలో మైనపు ముద్దలు

నీ ఉలి స్పర్శకు
పరవశించిన పరువాల రెమ్మలు
నీ ఊహల్లో విరబూసిన
అందాల విరికొమ్మలు

అదుగో !
ఆ స్తంభంపైన అష్టవిధనాయికలు
అరమోడ్పు కనులతో
దూరమైన నీ స్పర్శను
జారిపోయిన మధురభావనలను
వెదుకుతున్నట్లున్నారు
నీ తీయని ఉలిదెబ్బలకు
తమకంతో తాళలేక రసధారలై
రసజ్ఞుల గుండెల్లో ఘనీభవిస్తున్నారు

ఓయీ శిల్పీ !
నిలువెత్తు స్తంభాలపై
అందమైన శిలాలతలను పాకించావు
యుగాంతాలదాకా
వికసించే పూలు పూయించావు
పరిమళాలను మాత్రం
మా గుండెలకు అద్దినావు

## వెలుతురుముద్ద మా అమ్మ

అరవై దాటీ దాటకముందే
మంచాన పడింది
వెలుతురు చీకటిముద్దయై
దీపంకింద చేరినట్లుగా వుంది
మా అమ్మ

ఆగిఆగి అమ్మ
కన్నీరు కారుస్తుంది
ఎల్లకాలం బతకాలన్న ఆశతోకాదు
తన ఒడికి బడికి
గడియారం లోలకంలా తిరిగి
లోకంతీరు తెలియని మేము
ఎలా కాలాన్ని ఈదగలమోనని

ఒంటిచేతితో మా అందరి
అవసరాలు తీర్చిన అమ్మకు
ఇంటిల్లిపాదిమీ ఒక్క అవసరాన్నీ
సక్రమంగా తీర్చలేకపోతున్నాం
తనకు మొలిచిన చిగుళ్ళు  తీగలైసాగాలని
పందిరిగా విస్తరించి విస్తరించి
అలసిపోయిన అమ్మ
పండుటాకులా దిగులుపడుతున్నది

మమ్మల్ని నిలబెట్టడానికి
నడికట్టు కట్టుకున్న అమ్మ
ఇవాళ తానే వంగిపోయింది

చందమామను తాకిరమ్మని నన్ను
అంతెత్తుకు ఎగరేసి

అలవోకగా అందుకొని
హృదయానికి హత్తుకొన్న అమ్మ
ఇప్పుడు బురదలో ఇరుక్కున్న
చందమామయై బిక్కుబిక్కుమంటుంది

ఎక్కువసేపు కూర్చోలేదు
పడుకున్న చోటునుండి
పక్కకు జరుగలేదు
వెల్లకిలా, వత్తిగిలి
తనను తాను మార్చుకోలేదు
అయినా... అమ్మ ప్రయాణిస్తూనేవుంది
పురిటిగండం దాటే పసిపిల్లలా కాదు
తన అమ్మానాన్నల ప్రేమ
ఫలదీకరణం చెందని ముందటి క్షణానికి
విశ్రాంత శూన్యమందిరానికి
ప్రశాంత విశ్వసౌందర్యంలోకి
'అమ్మ ప్రయాణిస్తూనేవుంది'
అయినా ...నా కంటికి అమ్మ
వెలుతురు చీకటిముద్దయై
దీపంకింద చేరినట్లుగా వుంది

# వృక్షోహం

శివోహమై వెలగాలంటే – నేను తపస్సు చేయాలి
తపస్సుకో వనం, కనీసం చెట్టైనా కావాలి
ఆ చెట్టే లేకుంటే, శివోహం దేవుడెరుగు
“ అహం శవం ఖాయం”
వృక్షమన్నది లేని పరిసరం శ్మశానం, అది నిక్కం
అందుకే ముందుగా మనమనాల్సింది
శివోహం అని కాదు “వక్షోహం” అని.

ఓ మనిషీ!
చెట్టులేక నీవు లేవు
నీ పుట్టుక “వేరు” – చావు నేలరాలిన “పండుటాకు”
చావు పుట్టుకల మధ్య నీ బతుకు
ఓ మహావృక్షమే కదా!

చూచావా నీ బతుకూ, దాని తత్త్వమూ
చెట్టుతోనే ముడిపడి ఉందంటే నమ్ము.

ఊపిరాడాలంటే పచ్చని ఆకు కనికరించాలంటావు
వేసవి తాపమైనా, ఒంటి తాపమైనా తగ్గాలంటే
కొమ్మొక్కటైనా విసనకర్రై ఊగాలంటావు
ఎండకైనా చినుకుకైనా చిక్కకుండా ఉండాలని
చెట్టునీడకై పరుగెడతావు
కాని చెట్టు మాత్రం నాటవు, పెంచవ్
ఎవరైనా, ఏదైనా జడమై మిగలకుండా కువకువలాడాలంటే
పిల్లగాలో, పైరగాలో, పైటగాలో – ఏదో గాలి సోకాల్సిందే
కాని, నూరేళ్ళు నవనవలాడాలంటే మాత్రం కావాల్సింది
చెట్టుగాలే.

ఊహలు పుట్టాలన్నా, ఆలోచనలు తట్టాలన్నా
పొంగిపొరలే భావనలనొడిసిపట్టాలన్నా
ఎదకూ, మదికీ తలపులు తట్టాల్సిందే
బయటకో లోపలకో గడప దాటాలంటే
నెట్టాల్సింది చెట్టిచ్చిన తలుపుల్నే కదన్నా!
పరాయి నీడను భరించలేని ఆత్మాభిమానం
చెట్టునీడను కాదనలేదుకదా!

జాడలేకుండా మాయమవుతున్న ప్రాణులను
కాపాడుకోవాలంటే కాసింత నీడను మిగిలించాల్సిందే.
నీ పుట్టుకెక్కడ మొదలయ్యిందో తెలుసుకోవాలంటే
నీ తండ్రి వేరు పట్టుకొని పైపైకి పాకాల్సిందే
"వంశవృక్షం" గీయాల్సిందే

ప్రాణుల మూలాధారం ఎక్కడని తలిస్తే
విజ్ఞానశాస్త్రాలన్నింటిని తొలిస్తే
తెలిసింది "నీటిజాడ – చెట్టునీడ" అని
"నీరు ముందా – చెట్టుముందా"
అని అడగకండి దండంపెడతా!
పరస్పరాధారాలకు
ముందువెనుకల పట్టింపులుండవు.

"తాత నాటిన చెట్టు" కథను మళ్ళీ చదువుకుందాం
రేపటి మనతరాలకు ఫలాలనిచ్చే చెట్లు నాటుదాం
తెలంగాణ తల్లికి హరితహారాన్ని అలంకరిద్దాం
దేశానికి, ప్రపంచానికి ఆదర్శమై భూగోళాన్ని కాపాడుకుందాం
ఎండి పిండిలా రాలే "లైలప్ప" కాకుండా
ఈ భూమిని కాపాడుకుందాం.

# రైతుదే తెలంగాణము

ఓ కవీ!
నేనూ! రైతును
తోటి రైతుల ఆత్మహత్యలు చూసి
గుండె చెరువైన వాణ్ణి
ధైర్యంగా "బతకడం బతికించడం" తప్ప
మరేమీ నేర్వని నేలతల్లి బిడ్డను
జర నా ఈ మాటలను
నా రైతుసోదరులకు కవితగా అల్లి
ధైర్యం చెడొద్దని చెప్పవూ!
భవిష్యత్తుపై భరోసా కల్పించవూ!

మాయ పరదాలను కప్పి
వరదగా నీటిని మల్పుకపోయినపుడు
బొట్టుబొట్టుగా కూడి ఉప్పెనలా చెలరేగి
ఆంధ్ర జలరాక్షసులను ముంచిన సుడిగుండాలం
నా రైతుసోదరులకు
జర యీ విజయగాథను గుర్తుచెయ్

లోహంగా కొలిమిలోఎంత కాగినా
అవసరమైన రూపాన్ని అందుకోవడానికే
దెబ్బమీద దెబ్బలైన సుత్తిపోట్లకు
కొడవళ్ళు గొడ్డళ్ళు
లొంగినట్లుంటే తెలిసొచ్చింది
పదునెక్కే ఆయుధాలకు
ఓర్పు ఎంత అవసరమో!

కొడవలి పిడినుంచి పిడికిలిగా బిగిసేవరకు
పొలం గట్టుమీది తుమ్మచెట్టూ
వలస బల్‌రక్కసి పొదల
తుదనంట నరికేసిన గొడ్డలికి
కామనిచ్చిన ఇంటిముందరి వేపచెట్టు
పడుతూ లేస్తూ

ఎన్నిసార్లు విరుగుతున్నా ఇగురేస్తూ
తడబడినా నిలబడటమెలాగో నేర్పినయ్

ఇంతలోనే ఇంత అధైర్యమా !
నిన్ననే కదా ఏరువాక తోలింది
ఇప్పుడేనాయె విత్తనమేసింది
పంట కోసుకొనేదాంక
పండుగ (ఏరువాక) సంతోషం చల్లారనివ్వొద్దు
రైతుబిడ్డలం మనం
పచ్చనాకు సాక్షిగా చెబుతున్నా
పొద్దుపొడవటంతోటే బొట్టు బొట్టుగా కరిగి
మాయమయ్యే మంచులా
తెలంగాణ రాష్ట్రావతరణతో
మన కష్టాలు కన్నీళ్ళూ
కరిగిపోయేరోజు దగ్గర్లోనే ఉంది
చెలకా చెట్టూ
పనిముట్టూ మనం
అందరం కలిస్తేనే “మన తెలంగాణం”
అరిష్టాలను ఎదుర్కొంటేనే “నవతెలంగాణం”
కాలం కలిసొచ్చేదాంక
పదును చల్లారకుండా

అదునుదాంకా ఆగి ఉండడం
రైతులుగా మన ధర్మం
అప్పుడే
అందుకొని అందిస్తాం, అనుభవిస్తాం
బంగారు తెలంగాణం

**తొలిపొద్దు**

(కవితా సంకలనం)

తెలంగాణ భాషా సాహిత్య సాంస్కృతిక శాఖ

తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం

# కవిత్వమంటే

కవిత్వమంటే
అక్షరాలకు
అనుభవాల అత్తరునద్దడమే
గుబాళిస్తూ
గుంపులోకి ప్రవహించడమే

భావపరిమళమై ప్రకాశిస్తూ ఒకసారి
అగ్నిధారలా కురుస్తూ మరొకసారి
తిరుగుబాటు బావుటాయై విస్తరిస్తూ ఇంకొకసారి
భావాల పొదిలోంచి
దూసుకొచ్చిన అక్షరాంబువే కవిత్వం

మనసునుండి తనువుపైకి
తనువునుండి మనసులోకి
సంచరిస్తూ, తల్లడమల్లడచేస్తూ
ఆత్మానంద స్పందనలు సృష్టించడమే
పుడమికంతా
పులకాంకురాలను పూయించడమే

20-09-2013

# భయవిహ్వాల

వేడికి ఆవిరై
చల్లదనానికి గడ్డకట్టే
నీరు నా స్వభావం

సుఖాలు ఆవిరై
నిర్వేదం మేఘమై
వర్షిస్తున్న హృదయం నాది

ఆశలు ఘనీభవించి
ఆవేదన ద్రవీభవించి
దు:ఖమై పారుతున్న బతుకునాది

బాల్యవివాహానికి
బలియైన బాలికను
పోతురాజుముందు నిల్చున్న
మేకపిల్లను
పులినోట్లో తలయిరికిన
భయవిహ్వాలను

23-09-2013

## నేను దు:ఖాన్ని...

దు:ఖంతో  నాకు చిరకాల స్నేహం
కాలం
నా బతుకును చల్లకుండగా చేసి
వెన్నకోసమని చెప్పి అగ్గిపుట్టిందాకా చిలికినప్పుడు
కన్నీళ్ళేగా నన్ను చల్లబరిచింది
దు:ఖం తెలియని మనిషి ఉన్నాడంటే
నమ్మబుద్ధికావడం లేదు

కళ్ళు చెమర్చని, ఏడవని, ఏడవలేని మనిషి
రాయిగా పడివుండడానికీ పనికిరాడు
పాషాణం కూడా  అరిగి, కరిగి పారుతుంది
చరిత్రకు అద్దమై నిలుస్తుంది
దళసరి కాగితమై
భూతభవిష్యత్తులకు ప్రమాణ పత్రమవుతుంది

కన్నీరు కార్చడమంటే
బేలతనం కాదు
స్పందించే గుండె గుహలో
బొట్టుబొట్టుగా ఉట్టి
కంటికాలువలగుండా దుముకుతున్న
కారుణ్యజలపాతం
దోసిలిపడితే నిండలేదు – కాని
నడిసముద్రంలో ఒక కన్నీటిబొట్టును జారవిడిచాను
భరించలేని నా బాధామయ జీవిత చక్రగతిని
అందులో చూసి, జడిసిన సముద్రం
పలుదిక్కులకు పారిపోయే ప్రయత్నం చేస్తూనే వుంది
నాకు మాత్రం కన్నీరు
ద్రవీభవనం చెందిన అమ్మ హస్తాలు

అందుకే అప్పుడప్పుడు
ఎదుర్రొమ్ము తడిసేలా ఏడుస్తుంటాను
అమ్మచేతులుగా మారి నిమురుతున్న కన్నీటి స్పర్శను
అనుభవిస్తుంటాను
ఆగని వెక్కిళ్ళు
వెల్లకిలా కాళ్ళమీద పడుకోబెట్టుకొని
ఎగరేస్తూ గుండెలపై జోకొట్టినట్టుగా ఉంటుంది
నెమ్మదిగా నిద్రలోకి జారుకుంటాను
తెల్లారి పొద్దుపొడుపులో
అమ్మ చిరునవ్వును చూస్తూ మేలుకొంటాను
బతుకును చిగురింపజేసే సారం
కన్నీటిలో కూడా ఉందంటూ
ఆగిపోకుండా సాగిపోయే రహస్యం
సహనమేనని అమ్మేగా నేర్పింది

## మిన్నంటి ఎగరటానికి...

ఆకాశమనేది ఒకటుందని
దాన్నెట్లైనా తాకాలని
ఎగురుతున్న పతంగానిది
అత్యాశే కావచ్చు
తన సూత్రం మరొకరి చేతుల్లో ఉందన్న సత్యం
తెలియకపోవచ్చు – కాని
దాని తెగువకు నా నమస్కారం

నింగి నిలువునా చీలిన చీకటి గుహ
అంతులేని శూన్యమన్న సంగతి
గమనంలోకి రాకపోవచ్చు
మిన్నంటి ఎగరటానికి
వెన్నంటే తోకచాలనే దాని విశ్వాసాన్ని
తెగదెంపులదారం వమ్ముచేయలేక పోయింది
దాని ఆత్మబలానికి నా సాష్టాంగ నమస్కారం

అపరిమిత దూరానికి
ఏ దారమూ ఆధారమై తోడురాదని
నిలదొక్కుకునే దాకనే నిచ్చెనవుతుందని
"నిలువీతగాని"కా నిజం తెలిసే వుంటుంది
దాని సాహసానికి నా సహస్రప్రణామాలు

కనీసం తారాతీరాన్ని చేరకముందే
ఊహించని సుడిగాలిలో చిక్కుకొని
తిరగబడింది – కాని
తలకిందులయ్యే ఎవ్వారానికి తలొగ్గక
తల ఎత్తాలనే తాపత్రయంలో గిరికీలు కొట్టడం చూస్తుంటే
దాని పోరాటపటిమకు
ఆత్మప్రదక్షిణం చెయ్యాలనిపిస్తుంది

నేలకు దిగుతున్న ఆ పతంగంలో
దిగులే మాత్రం లేదు
అదేమిటని ప్రశ్నిస్తే
పతనమవుతున్న ప్రతిసారీ
ముళ్లపొదల్లో చిక్కాలని లేదు
ఎగరేస్తూ ఎగరేస్తూ ఏదో ఒకనాడు
గగనాంతర రహస్యఛేదనానికి
నన్నందుకోగలడు సుమా! అని అంటున్నంతలో
మాంజాతో మరోబాలుడు
రెండుచేతులతో ఎదురేగుతున్నాడు
ఆశ్చర్యంగా ఆ పతంగం
ఆ పిల్లాడి గుండెలపై భద్రంగా ల్యాండయ్యింది

22-09-2013

# బాల కార్మికులు

మెతుకు మెతుకుకై
మోయలేని బ్రతుకుకై
పురిటి నొప్పులే
ఆకలి కేకలుగా
అనుకరించిన
అభినవ కుమారులే
బాలకార్మికులు

ఆంధ్రజ్యోతి
ఆదివారం అనుబంధం
1993

## ఓటు

ఓటంటే
ఇచ్చిందాక పార్టీలను
ఇచ్చినంక ఓటర్లను
తోలుబొమ్మల్లా
ఆడించే సూత్రం

ఓటంటే
ప్రజల చేతులనుండి
జారిపోయే ఆయుధం
ఒక్కరోజు మురిపెం
ఐదేళ్ల దు:ఖం

వార్త దినపత్రిక
27-03-2009

## అభిశంసన

సంధ్య వార్చుకొని
ఇంటిముంగిలికి వెళ్ళాను
తులసిమొక్కకు నీళ్ళు పోయాలని
తాకిన నులివెచ్చటి రవికిరణాలతో
తనువు పులకరించింది

రాత్రి డాబామీద తడిపిన వెన్నెలకు తోడుగా
ఊగిఊగి తడిమి తడిమి
అల్లరిచేసిన పిల్లగాలులకు
పొటమరించిన యౌవనావేశం
నా సోమిదమ్మమీదికి సోయిమళ్ళిన తీరు
గుర్తొచ్చి – జగమే ఊయలగా తోచింది

పెరట్లోకి వెళితే
ఆకులను మరుగు పరిచేంతగా
విరగబూసిన పూపొదలు కనిపించాయి
బతుకంతా ఇలాగే గుబాళిస్తుందనిపించింది
ఆ పక్కన
డ్రమ్ములో నిండుగా నీళ్ళున్నాయ్
ఈ రోజుకు
గండం గడిచిందన్నంత హాయిగా వుంది
వంటింట్లో
ఏడాదికి సరిపడా బియ్యమున్నాయ్
డబ్బాల్లో
కొన్నాళ్ళకుగాని నిండుకోని దినవెచ్చాలున్నాయ్
జీవితం దండిగా ఉన్నదన్నంత తృప్తిగావుంది

అంతాబాగుందని గుండెనిండా గాలిపీల్చుకొని
నట్టింట్లోకొచ్చాను

జరాభారంతో కుంగిన నాన్న కనిపించాడు
నేలరాలడానికి సిద్ధమై
సగమంటుతో వేలాడుతూ
వడలిపోయిన పూవులా వున్నాడు
పక్షవాత రోగాన్ని జయించాలని
చచ్చుపడిన నరాల్లో రక్తాన్ని ఉరికించాలని
అటూఇటూ నడుస్తూ విరగబడిన అమ్మ
వయసుకు, బరువుకు మాత్రమే పెద్దతనం
కతిమ్మదంతా పసిపిల్లలకు లాగానే
అత్తామామలకు అలుపెరుగని సేవకై
పిల్లలకు నాకు సర్వం సమకూర్చే యజ్ఞంలో
రక్తాన్ని మండించి శక్తిని నింపుకొంటున్న భార్య
రక్తహీనతతో ఒకవైపు
అమృతం పక్కన విషంలా
ఆనందం అంచున్నే విషాదం
భగవంతుడా!
ఎలా సృష్టించగలిగావ్!?

అలజడిలేని మనసుతో ఆలోచిస్తే
"ఆనందమశాశ్వతం–విషాదమే శాశ్వతం"లా వుంది
దేవుడా! నీదెంత పక్షపాతం?
నీకేమో – ఎల్లప్పుడూ నిండుయౌవనం
మాకేమో – దినదినగండాలతో జరామరణావస్థలా!?

ఊరపిచ్చుకకు గండభేరుండంలాంటి రెక్కలు
ఎలుకకు ఏనుగులాంటి చెవులు
పెట్టకుండా పుట్టించినందుకూ –
వేలెడంతలావు తీగకు గుమ్మడికాయ
మర్రిమానుకు రేగుపళ్ళంత కాయలను కాయిస్తున్న
నీ సృష్టినీ, సృష్టిరహస్యాన్నీ పొగడాలని వున్నా
ఇంత మనిషికి
అంత రుజాగ్రస్థ జరామరణావస్థలు పెట్టి
కొరగాకుండా చేసినందుకు
నిర్ద్వంద్వంగా నిన్ను అభిశంసిస్తున్నాను

16-01-2014

## ఏం మనుషులో?

కొందరు
ముఖస్తుతిగా పొగడుతారు
అన్యమనస్కంగా విసరిన అక్షతల్లాగ
నా శిరస్సు వీటిముందు వంగదు

మరికొందరు
పలకరింపుగా నవ్వుతుంటారు
పెదాలు మాత్రం విచ్చుకుంటాయి
హృదయానికి ఆకుముడత తెగులు
ఆ నవ్వులు
రంగు వాసన లేని పువ్వులు
నా హృదయం వాటిని స్పర్శించదు

# నిక్కాక

నేను సువర్ణకారుణ్ణి
నేడు – బతుకు వివర్ణమైనవాణ్ణి
పెట్టుబడి లేక
సుట్టూ అద్దాలపెట్టెలు పెట్టుకోలేక
మెట్టెలకాన్నుండి ముండగాజులదాకా
మక్మల్‌బట్ట అట్టపెట్టెల్లో
అలంకరించుడు చేతగాక
శిలుంబట్టిన పనిముట్ల ప్రదర్శకున్నయిన
షోరూం పెట్టుకున్నోనికే
మార్కెట్ సొంతమయినంక
కాల్జేతులు, ఊపిరితిత్తులను
నమ్ముకున్న నా బతుకు
మొద్దుకు దిగేసిన డాకలైపోయింది

ముందలూరికి దగ్గరయితున్నకొద్దీ
ఎన్కూరు దూరమయిందన్నట్లు
పాతనగలకు మెరుగు పెడ్తున్నకొద్దీ
నా బతుక్కు కొత్త మైలంటుకుంటుంది
అయినా - నగలు సేయటమెప్పుడో మర్సిపోయిన
మొన్నమొన్న బెజవాడోల్లు
నిన్న సేలం మద్రాసోల్లు
ఇయ్యాల బెంగాలోల్లు
తెలంగాణతప్ప ఏం తెల్వని
నన్ను నా కాలుసేతులను
పట్టుకార్లతో అదిం పట్టింద్రు

సుత్తెడాకలి ముందలేస్కోని
పొద్దస్తమానం కూసున్నా
బొగ్గులకుంపటి రాజుకోకపోయె
కడుపులకుంపటి ఆరకపాయె
ఆలిముచ్చట, పోరల సదువులు
ఆ ఆమాటట్లుంచు - ఆకలితో
ఆల్లుసూసే సూపులకు
నీళ్ళుపోయకుంట కొద్తె

మించుపట్టిన కమ్మిలాగ
నా గుండె పగిలిపాయె

పెండ్లాం పిల్లలతో కలిసి పూటపూటకు
పేగులు ముడేసుకుంటున్నోన్ని
ఈ బతుకు తీగను రేపటిదాంక
తెంపుల్లేకుండ సాగదీసేదెట్లనొ?
బతుకంతా సమస్యలతోని
చిక్కువడ్డ తీగయింది
ఇప్పినకొద్దీ
మల్కలువడి నిక్కాకయితుంటే
ఇగ నగైనా – నేనైనా
ఎట్ల కొసెల్తం !?

"విశ్వకర్మ తేజస్విని" మాసపత్రిక
ఆగష్టు 2010

# చిదంబరుడు

అతని ఒంటిమీద బట్టల్లేవ్
నిజం – నూలు పోగైనాలేదు!
నా ఎడమ వైపునుండి కుడివైపుకు
హఠాత్తుగా దాటిపోయాడు
ఆకారం దాల్చిన వాయువులా తోచాడు
ఆ దృశ్యం
రెపరెపలాడుతున్న ఆలోచనల మీద
బరువుపెట్టిన రాయిలా వుంది
పిచ్చివాడా? కాదు!
ఉన్మాదిలా లేడు
వేమనలాగే వున్నాడు – కాని
పద్యాలు చెప్పట్లేదు
అతనిలో ఏదో తత్త్వం మెరుస్తున్నట్లే వుంది
నగరజనం మధ్యగుండా పోతూ
అరణ్యాన్ని వదిలిపెట్టిన
కొండగాలిలా వీస్తున్నాడు
అతన్ని
మగాళ్ళు బాహాటంగానే చూస్తున్నారు

ఆడాళ్ళూ చూస్తున్నారు – కాకుంటే
రెండోకంటికి తెలియనంత జాగ్రత్తగా
పిల్లలు మాత్రం
"పాపం పిచ్చోడం"టూ జాలి చూపిస్తున్నారు
నాకు మాత్రం సిగ్గేసింది
బట్టలున్నా లేనట్లు
అప్రయత్నంగా నా ఒళ్ళు ముడుచుకుంది
నాకు నేను దిగంబరంగా కనిపిస్తున్నాను
అప్పుడా క్షణం
నిలువుటద్దం ముందు
ఎవరిని వారు చూసుకున్నట్లే వుంది

నేటి నాగరిక ప్రపంచంలో
బట్టలున్న నగ్నదేహాలను
రోజూ చూస్తున్నదేగా!
చూపుల చేతులతో
ఎదుటివారి వలువలు వలుస్తున్నవాళ్ళమే కదా!
అపోజిట్ జెండర్‌మీద
రెక్కలు లేని పురుగుల్లా పాకుతున్నవాళ్ళమే కదా!
మనసులోని మలినమంతా
కళ్ళనుండి కక్కుతున్నవాళ్ళమే కదా!

అయినా ఆ దృశ్యానికి కలవరపడ్డాను
అతను మాత్రం
మానం – అవమానం
సిగ్గు – ఎగ్గు
సభ్యత – అసభ్యత
ఉచితం – అనుచితం
భూత – భవిష్యత్తులు
అన్నింటినీ వదిలి
ఈ లోకానికతీతంగా మిగిలి
యోగిలా కన్పించాడు
అందరికన్నా నిజాయితీగా తిరుగుతున్నాడు
కానైతే
"దిగంబర దేహం కాదది – చిదంబర దేహం"
'విలువలు వదిలిన మీ బతుకులపై
కఫన్‌లా విసిరిన ధిక్కారదేహం నాద'ని
నాగరికుల ముఖాన
తుపుక్కున ఉమ్మేసినట్లున్నాడు

(ఎన్నో ధిక్కారదేహాలను చూసిచూసి ఒకనాడు
ఈ అక్షరాంబరాలను కప్పే ప్రయత్నం చేశాను)

# ఇలాంటి వాడొకడుంటాడు

నిజస్వరూపం బయటపడ్డాక
తలుచుకుంటేనే అతను
భయమై ఆవహిస్తున్నాడు
ఆలోచిస్తుంటే చీకటిలా కమ్ముకుంటున్నాడు
అందరితో కలుపుగోలుగా తిరుగుతుంటే
'భోళామనిషి' అనుకున్నాం
కలుపు మొక్కై మమ్మల్ని
తొక్కినాకగాని తెలుసుకోలేకపోయాం
వాడు మా కారెక్టర్‌ను మార్ఫింగ్ చేశాడని

హాయ్! హాయ్! అంటూ
అందరి చేతులు చరుస్తూ పలకరిస్తుంటే అతను
ఓ మూర్తీభవించిన సహృదయస్వరూపమనుకున్నాం
అబలలమీద – అమాయకులమీద వేసే
రూమర్ల తాళపుదరువని ఆలస్యంగా తెలుసుకున్నాం

మా కష్టాల గురించి ప్రస్తావించినపుడు
తోడబుట్టినపాటి అనుకున్నాం
కష్టాలకు కారణాలు సృష్టించి
కథలు కథలుగా ప్రచారం చేస్తుంటే తెలిసింది
వాడు ..... "ముళ్ళతో గీరుతూ
ఆకులతో విసురుతున్న విషపుమొక్క" అని

స్నేహంగా నటించినా, ఆడవారిపట్ల
చివరకు మొగాడిగానే జీవించాడు
కొలీగ్‌గా కలిసి తిరుగుతున్నా
ఇల్లీగల్ "ఈగల్"గా విహరిస్తూ
మమ్మల్ని కోడిపిల్లల్లా బెంబేలెత్తిస్తున్నాడు

"ఫలానాచోట ఫలానావాడు" అని ఎలా చెప్పగలం
ఆడామగా కలిసి పనిచేసే ప్రతిచోటా
ఇలాంటి వాడొకడు వుంటూనేవుంటాడు

25-03-2013

# ష్ష్ష్ .......!

కీర్తి కీర్తి కీర్తి!
వాడి ఒళ్ళెప్పుడు
ఈ దురదతోటే కందిపోయి వుంటుంది
కుంతీదేవి మీద ఈర్ష్యపడ్డ
గాంధారి గుర్తుకొస్తుంది

పేరు పేరు పేరు!
ఇంకెప్పుడొస్తుందా అని
కానరాని పలవరింతలతో
చచ్చే సలపరింతతో
చిత్తకార్తెను తలపిస్తుంటాడు

గుర్తింపు గుర్తింపు గుర్తింపు!
నాకు రాకుండా ఎవడికో వస్తుందన్నట్టు
అక్కసుతో చూస్తున్న చూపులతో వాడు
శిథిలసౌధంలో
తలకిందులుగా వేలాడుతున్న గబ్బిలాలను
ఒంటరిగా వేటాడుతున్నట్లుంటాడు
ష్ష్ష్ ......................................!

# సీగుడ్డు

మనిషీ!
దేవుడు
నిన్నెంతగొప్పగా సృష్టించాడు
నారికేళ జలానికిచ్చినంత రక్షణ
నీకూ ఇచ్చాడు
సృష్టియనే పీచును
సమాజమనే టెంకెను
తండ్రిలాంటి కొబ్బరిని
తల్లిలాంటి పాలను
ఇన్ని పోషణలనిచ్చి
నీరుగా నిన్ను నిలిపాడు
తీపిలాంటి ఆత్మను పొదివినాడు
నీవు మాత్రం దుర్బల మనస్సుతో
తోలుగుడ్డుగా మిగులుతున్నావు
సహ్యంకాని ప్రవర్తనతో
ఛీకొట్టించుకునే
సీగుడ్డువైతున్నావ్

08-10-2004

## అంటుకడుపు

వినాయకా! నాదో డౌట్ !?
మా భూలోకంలోని రాజకీయనాయకులు
నీకన్నా ఘనులేమో!?
నీకు ఉత్సవాలు
ఏడాదికోసారి
అదీ, నవరాత్రులే!
కాంట్రాక్టర్లు, వందిమాగధులు
రౌడీలు (ప్రైవేట్ బాడీగార్డులు), పోలీసులు
అధికారులు, ఉచ్చుబ్బుమారి కార్యకర్తలు
ఇందరి మధ్యన మా నాయకులకు
మున్నూటరవయ్యయిదు రోజులూ
రాత్రింబవళ్ళూ బ్రహ్మోత్సవాలే!

వినాయకా !
గొంతెమ్మ కోరికలని యెంచక
కోరినవెల్ల తీర్చే అమాయకా!
సప్పిడి ఉండ్రాళ్ళకే సంబరపడిపోయే
అల్పసంతోషీ!
చూడడానికి
నీకింత బొజ్జుంది కానీ
భక్తులు సమర్పించుకున్న
ఉండ్రాళ్ళు, లడ్డూలు
కుడుములు, పాయసం, వడపప్పు
ఇంతేకదా! అందులో వున్నది!
ఎంత తిన్నా
ఏ పూటకాపూట అరిగేవే కదా!
విఘ్నాలను తొలగించువాడా! విఘ్ననాయకా!
గణాలను పాలించువాడా! గణనాథా!
విశిష్టమైన నాయకా! వినాయకా!
మా నాయకులకూ వుంది
'వినాయకుల'నే పేరు
నీకు లాంటి బొజ్జలు కావవి
వారు తిన్నవి భక్తులిచ్చినవి కావు
గుట్టుగా తిన్నవి కొన్ని

గుంజుకతిన్నవి కొన్ని
పిల్లిలా నాకింది కొంతే
కుక్కల్లా గతికింది ఎంతో!

అటవీభూములు, బంజరుభూములు
వనాలు, గనులు, గట్లు, గుట్టలు
చెట్లు, పుట్టలు, చేను, చెలుకలు
చెరువులు, కుంటలు, బలహీనుల ప్లాట్లు ...
ఇలా వనాల మధ్యన జనాల మధ్యన
మా నాయకుల ఆక్రమణలు, దందాలు
ఒకటా, రెండా!
ఎన్నెన్ని! ఎన్నని!
తరాలు తరాలు తరాలు
ఆపై తరాలు ఆపైతరాలు
తరాలకొద్ది కూర్చొని తిన్నా
తరగనివి, అరగనివి
అయినా
నీలా వీరికిక్కడ
ఏ పొట్టలూ కనపడవు
మింగిన నోళ్ళు ఇక్కడుంటె
పెరిగిన పొట్టలు స్విస్ బాంకుల్లో

వినాయకా! నీకూ
మా నాయకులకు
తేడా ఏమిటో తెలుసా?
నీది ముందుకడుపు
మా వారిది అంటుకడుపు....!

(కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలలోని మంత్రులు, అధికారులు అవినీతికి
పాల్పడి జైలుపాలైన వైనానికి కలతచెంది
09-09-2013న వినాయక చవితి సందర్భంగా)

# యయాయా! వీరు....

కొందరి నోటికి హద్దుండదు
అదేపనిగా తూటాలు పేల్చుతుంటారు
తీరా కార్యాచరణకు వచ్చేవరకు - వారు
తోలు తుపాకీలా తేలిపోతుంటారు
వాహ్! పిట్టలదొర తమ్ముళ్ళు

కొందరు
మీసం మెలేసి సవాల్ విసురుతుంటారు
కాలుదువ్వి తొడగొట్టేవాడు  ఎదురుపడగానే
తొండలై తొలగిపోతుంటారు
ఓహ్! మొనగాళ్ళకు కొనగాళ్ళు
కొనగాళ్ళకు మొనగాళ్ళు

కొందరు పత్తిత్తులై పలుకుతుంటారు
నిజం నిగ్గుతేలేసరికి
ఎదురుదాడికి సిద్ధపడి
సిగ్గులేక చిందులేస్తుంటారు
యయాయా! వీరు
మనరాజకీయనాయకులే......!!!!!!                15-09-2013

## ధర్మోరక్షతి రక్షిత:

నా దేశానికి ఒకటే దిశ
అది తూర్పు మాత్రమే
సూర్యుణ్ణి ప్రసవించడం
సమున్నతంగా ప్రకాశించడం
నిత్యచైతన్యమై పల్లవించడం
నా మట్టికి ఒక్కటే తెలుసు
యుగాలెన్ని మారినా

జగాలెన్ని కూలినా
జ్ఞానామృతభాండమై ఉప్పొంగుతూనే ఉండడం
ఆపై పలు ప్రవాహగతులై
చిరంతనంగా చిలుకరించడం
ఇక్కడి పౌరుణ్ణి చిరంజీవిగా నిలుపడం

నా చరిత్రకొక్కటే తెలుసు
యుగానికొక్క మహాత్ముణ్ణి కనడం
అందరినీ 'ఆ' సమస్థితికి చేరాలనడం
అందుకో 'కర్మమార్గం' చూపడం
కర్మనిష్ఠులకు సత్యవ్రతం నిర్దేశించడం
రాముడు, కృష్ణుడు
వీరు యుగానికొక్కరే
రామకృష్ణ పరమహంస, వివేకానంద
గాంధీజీ, అబ్దుల్ కలాం
ఈ యుగానికిలా ఎందరినో
కనడం, కలకాలం నిలుపడం

నా జనానికొక్కటే తెలుసు
భౌతికావసరాలకై
ప్రపంచమంతా పరుగెడుతుంటే

ఆత్మోన్నతికై
నిండు మందాకినిలా గమిస్తూ
భూతభవిష్యత్ వర్తమానాలకు
వారధిలా పరుస్తూ పురుషార్థగీతం పాడుకోవడం

నా జాతికొక్కటే తెలుసు
ఆధిపత్యం త్రోసిరాజని
"సంఘేశక్తి కలౌయుగే"
అందరమొకటై సాగుటే ధర్మమని
అది మాత్రమే వేదప్రమాణమని
ఇంతకుమించి మరేదైనా అవైదికమన్న
వివేకానందుని బోధనలు
ప్రపంచమంతా మారుమ్రోగేలా
శతాధిక కోటి గళాలతో ఆలపించుదాం
ఎదయెదలో నాటుదాం
నూటయాబయ్యవ జన్మదినానికి
వివేకునికిచ్చే మన నిజమైన నివాళి
ఇదే ఇదే ఇదే!

(స్వామి వివేకానంద 150వ జయంతి సందర్భంగా
నివాళులర్పిస్తూ  జనవరి - 2013)

# ఉపద్రవమే!

ఊరిమధ్య రచ్చబండ – అక్కడ
నలుగురు కలుసుకొని నవ్వుకుంటున్నారు
ఏమేమో గుసగుసలు పోతున్నారు
ఎవరెవరి గురించో ఆడిపోసుకుంటున్నారు
ప్రపంచమంతా వారిముందు
నేరస్తుడిలా విచారించబడుతుంది
పనిలేని, పనికిమాలిన ఈ నలుగురు
సోమరిపోతులైన సంతానం
చెదలుకు సోదరసమానం

అదో నాలుగుబాటల కూడలి
నలుగురు కలుసుకొని నవ్వుకుంటున్నారు
ఏమేమో గుసగుసలు పోతున్నారు
ఎవరెవరి గురించో ఆడిపోసుకుంటున్నారు

వీరిని గమనించకుండానే పనిమంతులు
తమ మానాన తాము వెళుతున్నారు
తమకే తెలియని
తమ ఆంతరంగిక విషయాలు(కల్పనలు)
శీలస్వచ్ఛతా
ఆ నలుగురి నోళ్ళలో మకిలి పడుతుంది
పనిలేని, పనికిమాలిన ఈ నలుగురు
అహల్య కొంపముంచిన
ఇంద్రుని అక్రమసంతానం
చెదలుకు సోదరసమానం

పదుగురాడు మాట పాడియై ధరజెల్లు
ఈ నలుగురు ఆ పదిమంది పెట్టు

సాక్ష్యం అక్కరలేకుండా
విచారణేదీ అవసరం లేకుండా
నిర్దాక్షిణ్యపు శిక్షకర్తులెవరంటే
ఈ నలుగురి వెధవల గురించి
ఒక్కసారి ఆలోచించాల్సిందే!

# అర్ధమపార్థం

నేను కవిని
నా కలం ప్రసవించేదంతా
నా అనుభూతుల బిడ్డలో
అనుభవాల కొడుకులో కానక్కరలేదు
పరకాయ ప్రవేశం తెలిసినవాణ్ణి

ఎందరి సుఖదు:ఖాలనో
నా గుండెకు "లబ్‌డబ్"లుగా చేసుకున్నవాణ్ణి
ఆ యువతీ యువకుల ప్రేమాయణం
అక్షరమక్షరంగా ఒయ్యారాలు పోతూ
ఒలుకుతుంది నా కలం
"ఈ కథలన్నీ
మన పెళ్ళికి ముందువా? తరువాతివా?"
యుద్ధం ప్రకటిస్తున్న ఇల్లాలి గర్జనలకు
కలం కలవరపడుతున్నది

ఇంటా బయటా ఎదురయ్యే హింసకు
ఆ యువతి బలయ్యినందుకు
నా కలం కన్నీరు కారిస్తే
"అది చస్తే ఏడ్చేటంత గట్టి సంబంధం
ఎన్ని యుగాలనాటిద"ని
ఆరాదీసి సంసార సుఖాన్ని అరగదీస్తుంటే
తడబడ్డ కలంలోని కవితా గంధం ఇగిరిపోతుంది

ఆ గయ్యాళి
వాళ్ళాయన నోరెలా కుట్టేసిందో
ఆసక్తిగా నా కలం ఏకరువు పెడితే

“నిన్నంత రాచిరంపాన పెడుతున్నానా” అంటు
రాయకుండానే రంపమై కోస్తుంటే
డంగైపోయిన నా పాళీది దగ్గుత్తుకయ్యింది

మదమెక్కిన మృగతృష్ణకు
ఆ పిచ్చితల్లి – నిజంగానే తల్లయ్యింది
ఎడారిలో ఒయాసిస్సుకొరకన్నట్లు
ఆ చంటిబిడ్డ
ఎండిన ఎదుర్రొమ్ముమీద
పాలతడికి పారాడుతున్నాడని రాస్తే
“ఆఖరికి నీ చూపులు
పిచ్చిదాని ఒంటిమీదకూడా పాకుతున్నాయన్నమాట”
అన్నపుడు
సోక్రటీసు గుర్తొచ్చాడని
తోటి కవీ!
నువ్వన్నప్పుడు నవ్వురాలేదు – కానీ
స్థానువులా మిగిలాను

# కార్గిల్

మౌనం
మహోన్నతం
దాన్ని కదిలించకు
నిన్నటిరోజుల్లో
ఆత్మలోలోపలకు
తీసుకెళ్ళిన రహస్యమార్గం

మునులు, ఋషులు, తపస్వులు
ఈ మెట్టుగుండానే
విశ్వరహస్యాల్ని సైతం
కూర్చున్న చోటునుండే దర్శించారు
అందుకే
మౌనాన్ని చెదరగొట్టకు

ఇప్పటికీ ఎప్పటికీ
మౌనం మహోన్నతం
దాన్ని కవ్వించకు
**మౌనం**
**ఇంధనం నింపుకుంటున్న**
**యుద్ధవిమానం**
యుద్ధం జరుగుతూనే వుంటుంది
బుద్ధుడు నవ్వుతూనే వుంటాడు
ప్రళయం ఏదైనా
భారత్ నిలిచేవుంటుంది
నిరంతరం వెలుగుతూనే వుంటుంది

(కార్గిల్ యుద్ధసందర్భం)

## మెతుకుబాంబు

మన చావుపుట్టుకలలో  మన ప్రమేయం లేనట్టే
బతకడంలోనూ మన ప్రమేయం లేదు
చావు పుట్టుకల గట్లమధ్య
బతుకంతా గోదారి
మన పాలకులు దేశవాళీ కుక్కతోకలు

మనం ఈదే ఈదుడంతా
మోతుబరి నాయకులను, దళారులను

కాంట్రాక్టులను, వ్యాపారులను
మోసగాళ్ళను, నేరగాళ్ళను
లంచగొండులను, లఫంగాలను
ఇంకా ఇంకా తదితరులను
వీపున మోస్తూ ఒడ్డుకు చేర్చడానికే
మనం మాత్రం గూదెళ్ళి చస్తున్నాం
అంతరిక్షంలో గతితప్పని గ్రహాల్లా
మనదారిన మనం బతికేస్తున్నాం
ఈ మాత్రం గ్రహించలేనివాళ్ళం కాబట్టే
రాహుకేతుగాండ్లు నానారకాలుగా పీడుస్తున్నా
ఆనక ఓ....తెగ ఓదారుస్తున్నా
వెర్రిమొ(మో)హాలతో వెంబడిస్తున్నాం
కాస్తంత వెలుతురుకే భ్రమసి
రెక్కలూడిన ఉసిర్లమవుతున్నాం

ఇన్నాళ్ళు మన మానాన మనం బతికినోళ్ళం
నీళ్ళింకిన గాజుకళ్ళతో
ఎండి నెర్రెలుబారిన
పొలాలమధ్యన తిరగలేక
ఇంట్లో ఉండలేక, ఊళ్ళో బతకలేక
అమ్మకయ్యకు వృద్ధాప్య పింఛన్లు చూపించి

ఇల్లుపొలాలు అమ్మి
బేమానుగాండ్ల మాటలునమ్మి
ఎన్నెన్ని కలలతో రైలు – విమానమెక్కినం
పొట్ట చేతబట్టుకొని
ఏ ముంబాయికో దుబాయికో పోతున్నం
పనిచేయడానికి పర్మిషన్ లేదని
చివరాఖరుకు జైళ్ళలో తోసిరి
ఇంటికాడోళ్ళకు శవం కూడా దొరకదాయె

తినడానికి ఏమీలేని నా సోదరులు
దుబాయ్ టికెట్ కొనడానికి
అమ్మకానికేం లేదనే బెంగతో
పట్నానికెళ్ళి అడ్డమీద నిలబడితె
బాంబులు పేలి బతుకు తెల్లారింది
చావడానికి ఏ ముంబాయో దుబాయో పోవాల్నా ?
మన 'దిల్‌సుఖ్‌నగర్' చాలదూ ?

చావుపుట్టుకల మధ్య బతుకులో
మన ప్రమేయం తోసిరాజంటుంది
'ఒకేఒక్కమెతుకు'

22-02-2013

## హమారా షహర్ హైదరాబాద్

పసివాడి నవ్వుల్లా వికసించిన పలువన్నెల పూవులు
ఒకే తీగకు నిండుగా అమరి అలరారినట్లు
మనలనందరినీ అక్కున చేర్చుకున్న
సుందరనగరం "హమారా హైదరాబాద్"

నా హైదరాబాద్‌లో
మందిరాలెన్నుంటే యేం
మసీదులెన్నుంటే యేం
పునాదులొక్కటైనపుడు

మన మూలాలు ఒక్కటేనన్న మురిపెం
మన ఎదయెదలో ముడిపడ్డప్పుడు!
మందిరాలు ఎన్ని మతాలవారివైతే యేం
అందలి ప్రార్థనలు–అందరి గుండె చప్పుళ్ళు
ఒకే ఘంటానాదమై మ్రోగుతున్నప్పుడు
నిరంతర సమతాగీతమే సంగీతమై పరవశిస్తున్నప్పుడు!

భాషలు ఎన్ని తీరులవైతేయేం
భాషణమంతా మాధుర్యమై ప్రవహిస్తున్నప్పుడు
యాసలన్నీ భాషామతోటలో చిలుకపలుకులై
తనువంతా పులకితగానమైనపుడు!

వ్యక్తిగత జీవితాల్లో వైవిధ్యమెంతుంటే యేం
అందరికీ హద్దు
మానవత్వమే మైలురాయిగా ఎదురుపడ్డప్పుడు
ఎక్కడో దాగి, ఎప్పుడో లేచే పైశాచికత్వాన్ని
మానవత్వంతో అదుముతూ
మనిషిగా గెలిచి నిలిచినపుడు!

అన్ని దిక్కులనుండి
ఎన్ని సంస్కృతులు వచ్చి చేరినా

అనంత విశ్వసౌందర్యంతో తేజరిల్లుతున్న
చార్‌సౌ సాల్ షహర్ "హమారా హైదరాబాద్"
పుడమి గంధాన్నంతా తనలో నింపుకున్న
నా తెలంగాణ తల్లి
నవరత్నఖచిత నాగరమై శోభిల్లుతుంటే
కన్నుకుట్టిన కుత్సితుడెవడో
గుండెలో బాంబుల మోత మోగించాడు
మతమౌఢ్యం పుట్టలు పుట్టలుగా పెరిగిన ఆక్రమిస్తాన్
విషపు నాగులను పొదిగించి పొరుగింట్లో వదులుతోంది
విషం పుక్కిటబట్టిన విషపు నాగులు బుసకొడుతున్నాయ్
"లోకాస్సమస్తాస్సుఖినోభవంతు" అనే సహనానికి ఫలితం
పడగలు పగిలాక తెలుస్తుంది

## మృగధర్మంగా మనం...

ఎవరు ఒప్పుకున్నా ఒప్పుకోకపోయినా
ఇప్పటికీ – ఎప్పటికీ – ఎవరికైనా
నిజం నిష్ఠురంగానే ఉంటుంది

ఒప్పుకోవటానికి మనసు
ఒకపట్టాన అంగీకరించకపోయినా
అసలుముఖాలు దాచుకున్న
మేకప్‌గాళ్ళం మనం

నాగరికం మాటున
నయవంచనకు పట్టం కట్టి
ఊరేగుతున్న వాళ్ళం
ఆటవిక న్యాయాన్ని
నట్టింట్లో పెంచుతూ
కామధేనువు ముసుగుతో
గడపదాటుతున్న వాళ్ళం
మన ధర్మాన్ని మంటల్లో కాలుస్తున్నాం - సరే!
మరే సిద్ధాంతాన్ని మాత్రం మనసుకెక్కించుకుంటున్నాం?
మానవత్వాన్ని ఎక్కడ(డో) జారవిడుచుకుంటున్నాం?
అన్ని ధర్మాలను ఆవలకు నెట్టి
మృగధర్మంలోకి జారిపోయామంటే
ఎక్కడ తేలుతున్నట్టు మనం?

ఇప్పుడు పట్టపగలు-నిశిరాత్రి
వీధి-ఇల్లు-పల్లె-పట్టణం-నగరం
అన్నతేడా లేక
అంతటా అబలలపై అనూచానంగా
అత్యాచారాలే ఆచారంగా మలుచుకొని
మగాళ్ళం కాస్తా మృగాళ్ళమై
తనువంతా కామకేంద్రమై

బలాదూరుగా తిరుగుతుంటే
తల్లీ, చెల్లీ, తనయలు
కంచెను నమ్మి కళ్ళుపోగొట్టుకున్న
కుందేళ్ళ గుంపయ్యింది

మనమంతా
నిజాన్ని పాతాళానికి తొక్కి
నిందను ఆవలకు నెట్టి
నేనెరుగ నేనెరుగ – ఏమెరుగనంటూ
నిక్కిచూస్తూ వెక్కిరిస్తూ
ముందుకెళుతున్న మృగాళ్ళం
మగాళ్ళం......

# కాలం

కలిసొచ్చినప్పుడే కాలం
విరిజల్లై పులకరింపజేస్తుంది
లేకుంటే
పర్వతమై పడేసి తొక్కుతుంది
అని అనుకుంటుంటాం

నిజానికి కాలం
మనల్ని వేటాడే గాలం కాదు
అజ్ఞానంతోనో, అలసత్వంతోనో
అల్పత్వంతోనో, అత్యాశతోనో
ఎరవేసి ఒడ్డున కూర్చుంటాం
ఆనక మనమే
కాలాన్ని గాలంగా చేసుకొని
కాళ్ళకు చుట్టేసుకుంటాం

04-03-2016

## చెప్పొద్దూ!

పగలూ రాత్రీ
చిత్రంగా అతుక్కుపోయాయి
ఏం జరుగుతుందోనని భయపడ్డాను
అంతా మంచే జరుగుతుందని సమాధాన పడ్డాను
ఇక రాత్రికి
పగటి వెలుగులు పూయిస్తాయనుకున్నాను
చెప్పొద్దూ, పగలే
చీకటి ముసుగును కప్పుకుంది
నిస్సిగ్గుగా !

06-03-2016

# అమృత కలం

గడిచిన ప్రతిక్షణం
పీనుగుల పెంటను తలపిస్తుంది
నా జీవితంలో
అమృతం కురిసిన ఒక్క రాత్రీ లేదు

ఎదురవుతున్న అనుక్షణం
యుద్ధకేళిని వెండితెరలా చూపిస్తుంది
ఇకముందు
ఒక్క హర్షపుజల్లు కురుస్తుందన్న ఆశాలేదు
నిరాశా కుహరంలో నిండా మునుగుతున్నా
కొనవేళ్ళు మాత్రం
ఏదో ఆధారం కొరకు వెతుకుతూనే ఉన్నయ్

నా గురించే రాసిన
ఓ కవితాశాఖ దొరికింది
ఆఖరి చూపని తలయెత్తి చూశాను
కావ్యవృక్షం కనిపించింది
“బాధాసర్పదష్టులారా! మేమున్నాం మేమున్నామంటూ
ఎన్నో కవికోకిలలు
నా గురించే పాడటం వినిపించింది
ఆసాంతం వారి కావ్యగానం విన్నాను
నాకిలా అనిపించింది
అందలి అక్షరాలు
రాణివాసపు పక్కమీద నలిగిన పూలేంకావు
యుద్ధోన్మాదుల మెడలోని దండలూకావు
నేను ధరించాల్సిన ఆయుధాలు
నేను ఎక్కుపెట్టాల్సిన బాణాలు
నేను విసరాల్సిన బల్లాలు

నేనంటే
అత్యాచార బాధితురాలిని
దళారుల చేతుల్లో మోసపోయిన రైతును
ఏటేటా ప్రకృతి ప్రకోపానికి గురవుతున్న కర్షకుణ్ణి
సీటు కొనుక్కోలేని విద్యార్థిని

యాసిడ్ బాధితురాలిని
రాగింగ్ భూతానికి బలిపశువును
కట్నం కోరల్లో చిక్కిన వివాహితను
గృహహింసలో దహనమవుతున్న ఇల్లాలిని
పేదింట్లో పుట్టిన బాలకార్మికురాలిని
చదువు పట్టాలెక్కినా
జీవితపు పట్టాలుతప్పిన నిరుద్యోగిని
యజమాని దాష్టీకానికి చిత్తవుతున్న కార్మికుణ్ణి
కామపు పురుగులకు పుట్టిన అనాథను
ఇంకా ఇంకా
సహస్రాధిక దౌర్భాగ్యాలను, దరిద్రాలను
సహనంతో అనుభవిస్తున్న అట్టడుగు జీవిని

కవులు పోస్తున్న ప్రాణంతో
అక్షరమిస్తున్న భరోసాతో
నన్ను నేను పదును పెట్టుకుంటున్నా

అనుక్షణం నిండుకుంటున్న విషకుంభాలను
పగులకొట్టి పాతరేసి
ఏదో ఒక రాత్రి
నేనే అమృతవర్షాన్నై కురుస్తాను

అగాధాలను పూడుస్తాను
అవలక్షణాన్నింటిపై అంతిమ యుద్ధం చేసి
శాంతి వనాలను పూయిస్తాను
అప్పుడు,  నేనంటే
అర్ధరాత్రి ఒంటరిగా తిరుగగల అతివను
రాజైన రైతును
వివక్షలు దరిచేరని మనిషిని
నెత్తురంటని ఆయుధాన్ని
అమృతమొలికిన కలాన్ని

05-01-2014

## పరమార్థం

జననమంటే
పేగును తెంపుకోవడం
మరణమంటే
బంధాలను తెంపుకోవడం
ఈ తెంపుకోవడంలోని పరమార్థం
బతుకుని అతుక్కోవడంలోనే ఉంది

23-02-2016

# విజ్ఞాన వీచిక

మానవత్వం పరిమళించే "మనిషిగా పూచే మట్టి"
"నా" నుండి "మనం" అనేంత ఎత్తుకెదిగిన
సంపూర్ణ మానవుడు
కష్టసుఖాల కలపోతైన జీవితాన్ని 'నేలకల'గా
కళాత్మకం చేసే మహాద్భుత కృషీవలుడు
'ప్రాణప్రదమైన' సాహిత్య సృజనలతో
సర్వుల హృదయాలనాపాదమస్తకం
ఆత్మీయ 'స్పర్శ'గా తరింపజేసే
అరుదైన సంవీక్షణల సం'చలనం'

కునుకు తీయకుండా 'వేణుగాన'మై
కవితా స్రవంతికస్తిత్వజీరగా మారే తాత్త్వికతాసారం
వ్యథాభరిత యథార్థ జీవితాలే కథలుగా
సాగిన విమర్శసుతా సగటు మానవుడి పాలిట
నెనరైన చల్లని పరామర్శ సమీరం
సమస్త సామాజిక రంగాలలో అందనంత ఎత్తులకెదిగి
సహృదయ కావ్యకళా ప్రపంచాన ఒదిగే
నిలువెత్తు సృజనసంతకం
విప్పిజూడబోతే
విశాల విశ్వమంత పసి(డి) హృదయం
శ్రమజీవుల స్వేదబిందువుకే
సతతం సలాం చేస్తూ
ఎగిసిపడే అలలోపలి సముద్రం!
పోరాటాలన్నిటా మన:పేయంగా
సంస్కారోద్యమ చైతన్యపతాకమై ప్రభాసిస్తాడు
లక్ష్యం దిశగానే అందరి గమనాన్ని
నిర్దేశించే మహా మహోపాధ్యాయుడౌతాడు
నాలుగ్గోడల మధ్య కూచున్నట్టుంటూనే
అదిమి పట్టజాలని విజ్ఞాన వీచికయై
నలుదెసలా విస్తరిస్తాడు

సుఖదు:ఖాల తాకిడులకు సమంగా చాచిన
దీర్ఘహస్తాలతో సకలవిధ చీకట్లను చీలుస్తూ
హమేశా సాంత్వన సుమాలందిస్తాడు
మహోన్నత విలువల ప్రతిష్ఠాపన కోసం పరితపిస్తూ
యుద్ధకవిగానే సర్వసన్నద్ధమౌతూ వస్తాడు
నిరంతర సమకాలీన జీవిగా
సాటిమనిషి మనుగడకనే భూ నభోంతరాలమోఘంగా మోగే
సంసృజన "రుంజ"వాద్యంగా
ప్రకృతంతా పరివ్యాప్తిస్తుంటాడు
అనుక్షణం విక్రమిస్తుంటాడు!
ఇంతకూ
అతనెవరంటే...!
శ్రీ వేణుసంకోజు!

# తరుణ కిరణం

"వాసు"
ఆ పేరు – మాకిప్పుడు ఓ జ్ఞాపకం
ఒకప్పుడు మాత్రం
మమ్మల్ని ఉక్కిరిబిక్కిరి చేసే పరిమళం

"వాసూ వాసూ!" అంటే
"ఆ వస్తున్నా బాబాయ్! వస్తున్నా పిన్నీ!
వస్తున్నరా శర్వాణి! వచ్చేస్తున్నా్రా శ్రీవాణీ!"
అని ఒదిగొదిగి వస్తున్నట్లనిపిస్తున్నా
వాడి వ్యవహారం – హుందాతనం చూస్తుంటే
వాడే మాకో "బాస్"లా అనిపించేవాడు

దోసిట్లోకిన్ని నీళ్ళు తీసుకుని
పొద్దుపొడుపుకు ముఖం తుడిచి
బద్ధకం వదిలించి ఆకాశంలోకి విసిరేసేవాడు
సాధ్యమైతే నాతో పోటీపడమని
వాడున్న చోటంతా చైతన్యావరణం
వాడు భూమిమీద ఓ తరుణకిరణం
ఆకాశంలోని అరుణకిరణం వాడిముందు
ఉతికి ఆరేసిన 'నారపోచ' అంటే నమ్మండి
సుడిగాలి కూడా వాడికెదురుగా
ఓడి నిలబడేది – బానిసలా చేతులుకట్టుకుని
తుఫానులాంటి వాడి వేగం ముందు అదెంత!

పనివెనుక పని పూర్తిచేస్తూ
సెలయేరు గలగలలా కదిలిపోతున్నా
అలసటేలేని వాడి ముఖంలో
సముద్రమంత సహనం కనిపించేది
కాలానికి ముందు వెనుకలుగా పరుగెడుతూ
జీవితం "సుస్థిరం" చేసుకోవాలన్న ఆతృత చూస్తుంటే
తీరం చేరాలనే కెరటం యొక్క ఆరాటం గుర్తుకొచ్చేది

నన్నధిగమిస్తాడని కాలానికి కన్నుకుట్టిందేమో
ఓ క్షణం వాణ్ణి బడబాగ్నియై ముంచేసింది
బిడ్డన్ని మళ్ళీ లేవకుండా వంచేసింది

వాడిప్పుడు
మా గుండెగోడకు
కాలం వేలాడదీసిన ఓ చిత్రపటం

(27-03-2013 హెూళీరోజు ఉదయం
వాసు  గుర్తుకు వచ్చినపుడు...)